# VIDULA

## ( Telugu )

For use in Higher Forms

Kavyateertha
Ghatti Lakshmi Narasimha Sastry

PUBLISHERS
SUNDARA RAM & SONS, TENALI



1945

0—14—0

# VIDULA

## ( Telugu )

For use in Higher Forms

BY

Kavyateertha

Ghatti Lakshmi Narasimha Sastry

PUBLISHERS :

SUNDARA RAM & SONS, TENALI.



1945

[ 0—14—0

# విదుల

## ౧

### సంజయుని జాదలు

ఒకనాఁటి ప్రొద్దుపొడుపున నొకానొక కాననమున నొకసరస్సుదరి నొకసరసురాలు కూర్చుండి బిందె దోముచుండెను. చిగురుటాకులవంటి చేతులు బిందెమీఁద నాడుచుండెను, గాని యామె మనసు మాత్రమెంతో దూరదేశమునఁ దిరుగుచుండెను. ఆ ఘటశుద్ధి యైనఁగాని చిత్తము స్వస్థము కాదు. మనసు సన్నిహిత మైనఁగాని ఘటశుద్ధి పూర్తి కాదు. ప్రజల పనులు పూర్తి కాలేదని సూర్యుఁడు మెల్లమెల్లగా నడచునా? ఆయనపని యాయనది. అప్పుడే జాము ప్రొద్దెక్కినది. పశువులు, పక్షులు సైతము తమతమ యాహారార్థము పరిభ్రమింపఁ జొచ్చెను. కొందఱు సోమరులు మాత్రము నులకమంచమును విడిచిపెట్టకుండ నిద్దుర మొగముతో నుసులుకొనుచున్న నేమి? పురుషార్థపరులు కాని ఆవానరులు తిర్యగ్జంతులకన్న నధమస్థులే కదా! ఇంతలో నెక్కడనో పేరెముతీయుచున్న గుఱ్ఱము గిట్టల మ్రోఁత టక్కుటక్కు మని దిక్కులఁ బ్రతిధ్వనింప నచ్చోటెల్ల కడు నదరఁ జొచ్చెను. పక్షులు, మృగములు కలకవాఱెను.

ఆ నాతి కప్పుడు చెవులకు మాత్ర మా మ్రోఁత వినఁ
బడినది. కొంతసేపునకు గుఱ్ఱ మొక్కటి కన్నుల కగపడెను.
దానిమీఁద నెవ్వఁడో యొక పురుషుఁ డున్నట్లే యామెయను
భవము. ఏమి గుఱ్ఱమో, ఏమి మనిషియో, ఏమి రావడమో,
తా నెవరో, ఉన్నచో టేదియో, పాప మాసుందరి కింకను
మనసున కెక్కలేదు.

అట్లా పురుషుఁడు వచ్చి వచ్చి చెఱువుకట్టమీఁద దిగి
గుఱ్ఱముకళ్ళెము నొకచెట్టుకొమ్మకుఁ దగిలించి యల్లలనాడు
చున్న కుచ్చుతలపాగా దీసి యచ్చోటన పెట్టి తిన్నగా
న న్నారీమణిఁ దిలకించెను. మొదట వనదేవత యనుకొనెను.
తర్వాతఁ గొన్నిలక్షణములనుబట్టి మనుష్యస్త్రీయే యని
తెలుసుకొనెను. మొగముఁజూచి రాజస్త్రీ యని విశ్వ
సించెను. కాని తద్వ్యాపారముఁ గనుఁగొని సంశయించెను.
పరస్త్రీ యనియో క్రొత్తచూ పగుటనో ముందుగా దగ్గరకు
రాలేదు. మాటలాడుటకు బిడియపడెను. తఱచుగాఁ
జూచిన నేమనుకొనునో యని గొంకెను. కాని క్రమక్రమ
ముగాఁ జూచి సమీపించెను. మాటలాడఁ దలఁచెను.
కాంతామణియు జలమునకై వచ్చుచున్న వానిరాకడకుఁ
త్రోవ యిచ్చి సహజమగు స్త్రీస్వభావముతో ముడుచుకొని
దూరముగాఁ దొలఁగి నిలఁబడెను. వాఁడును నీటిలో దిగి
పుక్కిలించి యుమిచి దప్పి తీర్చుకొని వెనుకకుఁ దిరిగి ముచ్చ
టింపఁదలఁచి యా కాంతామణి నాపాదమస్తకము నొక్కసారి
చూచెను. అప్పు డెక్కడనుండియో యామెచిత్తము గబ

క్కన వచ్చినది. భయముతో నొడలు వడఁకినది. చెమట పోసినది. నిశ్శంకముగా నన్నీతఁడేల చూడవలె నని తలఁచు చుండ నామెనేత్రాంతములకుఁ గోప మెక్కినది. నన్నెవ్వ రేమి చేయఁగల రని ధైర్యముఁ గొంత దెచ్చుకొనెను.

అప్పుడు వారిసంవాద మీవిధముగా జరిగినది.

పురుషుఁడు—కమలాననా! నీ వెవ్వతెవు?

స్త్రీ—అన్నా! నాజోలి నీకేల? నే నొక్క క్షత్రియస్త్రీని. ఒంటరిగా నున్నప్పుడు మీబోంట్లతో మాట్లాడుట మా యాచారమునకు విరుద్ధము.

పు—మాట్లాడినమాత్రమున నాచారము చెడదు. మనసు మంచిది కావలెను. కొందఱు మూఢు లేమనుకొనిన నేమి? నీవృత్తాంతము కావలసియే యడుగుచున్నాను. క్షత్రియ స్త్రీ నంటివి. అంతఃపురములో నున్నప్పు డాచారముగాని యడవిలో నేమి యాచారము! ఐనఁ బరిచారిక లేరి ?

స్త్రీ—ఉత్తములగువార లేదేశముననైన నేకాలముననైనఁ దమయాచారము తప్పకుండఁ గాపాడుకొందురు. ఆపద యని స్వభావము విడిచిన సంపదలో నది సమకూరునా? తక్కిన నీప్రశ్నములకు సమాధాన మనవసరము. నీదారి నీ వేగుము. తండ్రీ! న న్నేల యలజడిపాలు చేసెదవు!

పు—ఓహో! నీప్రసంగ మతివిచిత్రముగా నున్నదే. సరిసరి. రమణీ! నీమగఁడు మగపాడివాఁడేనా? అట్లైన నీ దురవస్థ నీ కేల సంభవించును?

స్త్రీ—అయ్యో! అనవసరప్రసంగ మేల సేసెదవు? నా భర్త మగవాఁడైన నేమి? కాకున్న నేమి? మాయాపద నీ వార్చువాఁడవా? తీర్చువాడవా? పురుషులయత్నములకుఁ గాలము అదృష్టము తోడుపడవలసియుండ నెవ్వరి నే మని నిందింపఁదగును?

పు—మగువా! నీధర్మపన్నములు చూడ నీవు చెప్పకపోయినను నా ప్రశ్నముల కన్నిఁటికి సమాధానము వచ్చినది. శత్రువులచేత నోటువడి ప్రాణములమీఁది తీపితో నరణ్యవాసముచేయు నధముస్తుని యిల్లాలవు నీవు. నీసౌందర్యమునకు వయసునకుఁ బుటుకకుమాత్ర మీా నీచత తగదు. నన్నువరించి నాచేత నీయిష్టమువచ్చిన పనులు చేయించుకొనుము. నన్ను నావారి నెల్ల నేలికొనుము. సామ్రాజ్యమెల్ల నీయధీనము సేసెద. నాయట్టి దాసుని వలన నీకు సాధింపరానిపని గలదా? ఏమందువు? పోయివచ్చెదను. సెలవిచ్చిన రథముగాని గంధగజముగాని మేనాగాని తెప్పించెదను. నే నొక్కఁడ నని తలఁపకుము. సైన్యమల్లదె, యా తమాలవృక్షముల చాలునకుఁ బైనున్నది. నీవు నన్నాదరించినను నేను నిన్ను విడిచిపెట్టను.

స్త్రీ—ఛీ, దుర్మార్గుఁడా! నీకంటికింత దిక్కు లేని దాననుగాఁ గనుపించుచున్నానా? నీకేమి తల్లి తోడు వెనుక ముందు లేదా? పుణ్యపాపవిచారమైన లేదా? ఒంటరిగ నున్న పరస్త్రీతో మాటలాడుసాహసమే కాక యింతగాఁ దెగబడితివి. నీకింక నాయుష్యము లేదా? గజేంద్రుని గాచిన

భగవంతుఁడు బ్రహ్మాది స్తంబ పర్యంత మిమిడి యుండి మంచిచెడుగుల నీక్షించుచునె యున్నాఁడు.

ఇంత యేల?, నా పాతివ్రత్య విశేషముననే నిన్ను బూడిద చేయలేనా? ఇంకనైన నీయవివేకముఁజాలించి బుద్ధిమంతుఁడవై బ్రదుకుము, పొమ్ము. పురుషాధమా! రావణాదులతో సరి కాకుము.

అని పైఁటచెఱఁగుతో మొగముఁ గప్పికొని కన్నీరు ధారగా గద్గదస్వరముతో నాకలకంఠి తొలఁగి నిలఁబడెను.

అది గని - "అదృష్టవతీ! ఏడువకు మేడువకుము. నీకు మంచి దశ యుండుటచేతనే నీవు చెప్పిన భగవంతుఁడు నాకీ బుద్ధి పుట్టించినాఁడు. నేను చెప్పినమాట లన్నియు మనస్సులోఁ దలపోసికొని కార్యనిశ్చయము సేయుము. ఇప్పుడే యేమి తొందర వచ్చినది? నీవారితోనెల్ల నాలోచించుకొనుము. ఆఱుమాసములు గడు విచ్చితిని. నాకు మించిపోయిన దేమున్నది? పరాభవము నొంది యడవిలో నులకమంచ మాశ్రయించి పురుషగణనలోనుండి తప్పిపోయిన నీపురుషుఁడు నా కడ్డమా? నీపాతివ్రత్యము మహిమ కలదంటే, వదియుఁ జూచెదను. తాటాకుచప్పుళ్ళకుఁ గుందేళ్ళు జడియవు. రాఁబోవు మాఖ శుద్ధచతుర్దశినాఁటికి నేను మరల వచ్చెదను. అదియే శివరాత్రి. శివానుగ్రహమున నానాఁటితో మన దుర్దశ లన్నియుఁ దొలఁగి పోఁగలవు. జాగ్రత్త. ముగ్ధరాలా! నన్ను మఱువకుము"—అని పాగా ధరించి గుఱ్ఱ మెక్కి చటచటమనుమ్రోఁతతో నాతఁడు వ్రాయెను.

పిదప నాపరిశుద్ధయు నాపన్నయై దైవముఁ దలంచుచు నేమేమొ తలపోసికొనుచు బిందియతో నీళ్ళు తీసుకొని—
ఉత్సాహవంతున కాపద లెన్నఁడు రానేరవు. నానాథున కా యుత్సాహము లేకపోవుటచే నీదుర్దశ నాకు సంభవించినది. కాకున్న సాటివారలతోఁబాటు నేను భాగ్యవతిని గానా ? నానాథునకుమాత్ర ముత్సాహము లేదుకాని పరాక్రమ మేమయినది! ఇంక నాకదియే శరణమగుఁ గాత—మనుచుఁ జిన్నవుచ్చుకొని పోయెను.

## ౨

## కవినిర్వేదము

ఒకనాఁటిసాయంకాలము సంధ్య, చీఁకటి, చుక్కలు, నెల, వెన్నెల, క్రమక్రమముగాఁ బొడసూపుచుండ నొక్కపూఁదోటలో చకచక నడచిపోవుచు నొకమానవుఁ డిట్లనుకొనఁ జొచ్చెను—

అక్కటా, కాలయోగమున నరఁట్లు క్రుంగిపోవును. ఆముదపుచెట్లు వృద్ధిజెందును. మంచివారు మంచిపని చేయుచు నెవ్వరేమనదరో యని బ్రదికియున్నంతకాల మయశమునకు జంకి యొదిగియుందురు. హీనుల కది లేదుగనుక మంచి యని చెడుగని విచారము లేకుండఁ దలయెత్తుకొని విజృంభించి తిరుగుదురు, నాకుఁజూడ వీరే ధన్యులుగాఁదోఁచు

చున్నారు. ఈకాలమున నేను నొక కవినై యేలజన్మింపవలెను? నాయకుఁడు రసికుఁడై యాదరించు నెడ నీ దేశకాలముల నెంత గానైన వర్ణింపవచ్చును. రాజులు రాజస్త్రీలు కవితారస మాస్వాదించువారై రసికులై యున్ననాఁడు ధన్యులైన కవివరులు ప్రతిష్ఠఁ జెందిరి.

ఈ కాలముననో కవిత నామమాత్రావశిష్టమైనది. అతిశయోక్తి యబద్ధమఁట. ఉత్ప్రేక్ష దానియవ్వమ్మ. ఉపమ అప్పటి కప్పుడు తయారుచేయవలెను. శబ్దాలంకారములు గుణములు స్త్రీలు సైత మాదరించుటలేదు. దేనికదియే రీతి. పాకములు పాకశాలలయందే చూడవలెను. ఎట్లున్నను శయ్యయే. ఛందస్సు ఛాందసులది. రసమెక్కుడైన నిప్పటికాలమువారు భరింపలేరు. పండితులు పక్షపాతగ్రస్తులై కవిత్వమున దోషముల నెంచుచున్నారు. కావ్యనాటకాదుల కంటె నవల లన్నఁ బ్రకృతమున నాదరము మెండు. ఇంక నేమూలఁ జూచినను సంస్కారము కావలె నని గందరగోళము వినఁబడు చున్నది. అదియు నొకకొన్నిఁటికి మాత్రమే మిగిలియున్నది.

ఒకరిననేల? ప్రస్తుతము నేను నా వేషమే వేసుకొంటిని. కొన్నితప్పులు కనబడినిఁగాని గ్రంథము నెవ్వరుఁదిలకింప రని ప్రయత్నింప వలసివచ్చినది. దేనితోడను బొట్ట పూడక రాజకార్యములలోఁ బాల్గొనవలసివచ్చినది. ప్రస్తుతము వార్తాహరుఁడ నైతిని. రాజులయొద్దఁ జేరిన తోడనే యెవ్వరే కార్యమున కర్హులో విచారింపక వారు హీనకార్యములయందును

నియోగింతురు. పొట్టకొఱ కేమైనఁ జేయక తప్పదు. తమయధి కార మెంతయో తమజ్ఞాన మెంతయో తెలియక మదాతిశయమున నధికారపురుషులు మర్యాదగ మాటలాడరు సరిగదా తిరస్కరింతురు. కవిదృష్టికి వీరు పురుగులును గారు. ఐననేమి? వారినే యనుసరింపక తప్పదు. ఈగొడవ తీర్చువా రెవరు? ఆర్చువా రెవరు!

మా రాజుగారుమాత్రము నన్నీయుద్యమములో దింపి పంపుచు, నీకవితావిలాస మంతయుఁ జూపి మనయభీప్సితము సాధించుకొని రావలె నని గట్టిగాఁ జెప్పినారు. కవితావిలాసము మనస్సు నాకర్షించు ననునది వీరి వాడుకమాట. అంతమాత్రము గౌరవమునకే యాకవితయు సంతోషించుచున్నది. ఏమి చేయును పాపము!

నేను ప్రస్తుత మొక రాచముసలమ్మకోసము వెదకుకొనుచుఁ బోవుచుంటిని. ఆమె యెక్కడ దొరకునో? ఆయమకు రాజధర్మ ముపదేశింప వలెనఁట. ఈయుద్యోగమును మెచ్చుకొనవచ్చును. పురుషులు పరాక్రమశూన్యులు, అభిమానదూరులు, అవిశేషజ్ఞులు నయినప్పుడా మొద్దులతో మాట్లాడుటకంటె నాడువారలకు వారిలో ముసలమ్మలకు ధర్మము సులభముగా బోధింపవచ్చును. కులాచారధర్మముల మీఁది పట్టుదలలు భగవంతుఁడు ముసలమ్మల యధీన మొనర్చెను. రామ! రామ! రాజులు సోమరులై చదువుకొనక యుత్సాహ మన నేమియో యెఱుంగక బ్రాహ్మణులకన్న భయగ్రస్తులై యాకలములఁ బొట్ట నిండించుకొనుచున్నారు.

బ్రాహ్మణుఁడ నగు నాకుఁగలమాత్ర ముత్సాహ ముండిన రాజులు కుబేరునైన జయింపవచ్చును. రాజ్యసంపదకు మూల ముత్సాహము. అది లేనివాఁడు రాజు కాఁజాలఁడు. ప్రస్తుత మా యుత్సాహము నేను మాటలాడఁబోవు ముస లమ్మకుఁ గలిగిన నామె చక్రముత్రిప్పఁగలదు. ప్రసిద్ధులగు రాజనీతివేత్తల గ్రోవ లన్నియు వర్ణించి చెప్పి యామెను వీరరసమున కాధారముగ నొనర్చెదఁగాత. అదె యాముని కుమారునితోఁ గలిసి గుర్తులడిగి వెదకికొనుచుఁ బోయెదనని యా పురుషుఁడు సత్వరముగ నరిగెను.

## ౩

## విదులామహోపదేశము

ఒకానొక యడవిలో నొకపర్ణశాలవాఁకిట నొక నులక కుక్కిలో వ్రేలాడుచు నొక సోమరి బుభుక్షితుఁడై ప్రొద్దు సూచుచుండ నొక ముసలమ్మ వచ్చి వానికింతెనంత దూర మున నిశ్శ్వమనుచుఁ గూర్చుండెను. ఆయువకుని సూపరేఖా విలాసములు చూచి వాని ప్రస్తుతదశ చూచినవారెల్ల సాము ద్రికశాస్త్రమును నిందింపకమానరు. కాలమెంతకైనఁజాలును గదా. అప్పుడు వారిరువురు నిట్లు మాటలాడఁజొచ్చిరి.

యువకుఁడు—అమ్మా! పాక మయినదా?

ముదుసలి—బిడ్డా! ఉత్సాహము లేని యబలల కేయుపాయము వలనఁ బాకము సిద్ధింపఁగలదు?

య—తల్లీ! న న్నేల గారించెదవు? కనికరమైన లేక యిట్టి దశలో నున్న నన్ను బిడియపెట్టి చేయింపఁగలది కాని చేయఁగలదికాని యేది?

ము— ఓరీ! నిన్ను నాకొడుకనరాదు. శత్రువులను బాగు చేయు పందవు. నాపోలిక, నాతండ్రిపోలిక, నీతండ్రిపోలిక, నీతాతపోలిక లేకుండ నెక్కడనుండి వచ్చిపడితివి! అభిమానములేక లెక్కకు రాని నిను విధి నపుంసకునిఁ జేయు పరికరముతో సృజించి నట్లున్నది. చచ్చినదాఁక నిరాశుఁడ వైన నేమి పురుషార్థము సాధించెదవు? నేను తక్కువవాఁడ ననుకొనకుము. హీనపుబ్రదుకు బ్రదుకకుము. మనస్సును బాగుచేసికొనుము. భయపడకుము. కాపురుషుఁడా! లేలెమ్ము. వైరుల కానందము, బంధువులకు శోకము, గలిగించుచు నోడిపోయి యిట్లు నిద్రింపకుము. ఎలుకదోయిలివలె నీయట్టి కాపురుషుని మనస్సు చాల చిన్నది. స్వల్పముతోనే నిండింపవచ్చును. ఘామకోరవారిన కుక్కవలెఁ జావకుము. చచ్చునప్పుడును బరాక్రమింపుము. డేగవలె శత్రువులసందు లెమకుచు నూరక తిరుగుము. పీనుఁగువలె బడియుండి షండుఁడవు కాకుము. హీనుఁడవుకాని, మధ్యముఁడవుకాని కాకుము. సర్వోత్తముఁడవుగా నీపౌరుషముచే విశ్రుతుఁడ వగుము. ఈదశలోఁ గృపణుఁడవై నశింపకుము. తిందుకకాష్ఠము వోలెఁ గొంచెముసేపైన బాగుగా మండుము. ఊకలో నిప్పువలె జాలసేపు పొగరాజుచున్న నేమిలాభము? మంచి

పుట్టుక పుట్టిన రాచవాఁడు చేతనైనంత పౌరుషము చేసి, యుద్ధమొనరించి, రాజధర్మముబుణముఁ దీర్చుకొని కృతార్థుఁడగును. లాభాలాభములఁ జర్చింపఁడు. ముందుపని చేయుచుండును. ప్రాణములే ధనమనుకొనఁడు. కొడుకా! ధర్మమునుఁ బురస్కరించి పరాక్రమమునైన ప్రకటింపుము. ధ్రువమైన యుత్తమగతినైనఁ జెందుము. ఏమని బ్రతికెదవురా? భోగహేతువులగు నిష్టాపూర్తములు, సమస్తమగు కీర్తియుఁ జెడిపోయెనుగదా! ఓడి యాపదలో మునిఁగి పడిపోవుచున్నవాఁడు శత్రువు పిక్క గట్టిగా లంకించుకొనవలెను. ఆజానేయాశ్వమును జూచి యెగిరి బరువు మోయుట నేర్చుకొనవలెను; సత్వమును, మానమును, పౌరుషమును, వెదకికొని నీమూలమున భగ్నమగు కులధర్మమును నీవ యుద్ధరింపుము. ఎవనిప్రవర్తనమును లోకమెల్ల నద్భుతముగాఁ జెప్పుకొనదో, దానమునఁ దపమున యజ్ఞమున సత్యమున నర్థలాభమున నెవ్వనికీర్తి వెలువడదో, విక్రమముచేతఁగాని విద్యచేతఁగాని సంపదచేతఁగాని యెవ్వఁ డన్యులనెల్ల మీఱఁడో, వాఁడు స్త్రీయుఁ గాఁడు, పురుషుఁడుఁ గాఁడు. తల్లినిఁ గష్టపెట్టుటకును, జనాభాలెక్క పెంచుటకును బనికివచ్చునొక మొద్దనవచ్చును. అన్నవస్త్రములు లేక పరాభవమును బొంది నిరుత్సాహుఁడవైన నిన్నుఁ జూచినీబంధువులు స్నేహితులు నన్నెన్నివిధముల నిందించుచున్నారో యెఱుఁగవుకదా? శివశివా! పరమేశ్వరా! ఏసీమంతినియు నావలె నిట్టి

నిర్భాగ్యునిఁ గనకుండెడుఁగాక. జిగీషువునకెప్పుడును దృప్తి పనికిరాదు. తండ్రీ! నామాట. వినుము పుత్రకా! హృదయము బాయి చేసుకొని చచ్చినను దలఁచినపుడెల్ల సరి పడనివారిగుండెలు పగుల, క్షణముకాని, నిమిషముకాని, యర్థనిమిషముకాని. శత్రువులనెత్తిన మండిపడుము. నన్నానందింపఁజేయుము. నీవు జయమగుఁగాత. త్వరపడి యుత్సాహసహాయుఁడవగుము. లెమ్ము. పొమ్ము. ఇదిగో యాయుధము.

యు—తల్లీ! ఎంత నిర్దయురాలవమ్మా! నేను కనఁబడకపోవునెడ నీకీభూమి యంతయు దొరికినఁగాని, యింటినిండ సొమ్ములు వచ్చినఁగాని, భోగములు కలిగినఁగాని, ప్రాణముండినఁగాని యేమి ప్రయోజనము సంపాదింపఁబడ గలదు?

ము—ఆత్మ ననాదరించువారికగులోకములు మనశత్రువులపాలగుఁగాత. ఆత్మోద్ధారకులగు పుణ్యులలోకములు మన మిత్రులకు సంప్రాప్తములగుఁగాత. భృత్యులు లేక పరులు పెట్టు పిండముల కాసపడి నిస్సత్త్వులై బ్రదుకు కృపణుల మార్గమున నడువకుము. బ్రాహ్మణులును స్నేహితులును నిన్ను, భూతములు పర్జన్యుని, దేవత లింద్రునివలె ననుసరించి జీవింతురుగాత. పరాక్రమశాలియగు నేపురుషునిఁ బండినచెట్టునువలె నాశ్రయించి యెల్లరు సుఖము నొందుదురో, వానిజన్మము సార్థకము. తనచేతులలావు నవలంబించి బ్రదుకువాఁడెవఁడో వాని కిహపరములు రెండును

దక్కును. ఈదశలో బౌరుషమును విడనాడఁ దలఁచు చున్న నీవు కడు హీనులు నడచుత్రోవ నడుగువెట్టు చుంటివి. తన కున్న విక్రమమునకుఁ దగినట్లు తేజముఁ బ్రకాశింపఁజేయక ప్రాణములమీఁది తీపితో నొదిగి యుండు క్షత్రియుఁడు దొంగ యని పెద్దలు వాడుదురు. కొమరా! నే నేమిచేయుదును! అర్థగౌరవము గలిగి యుక్తి యుక్తములై గుణవత్తరములైన నామాటలు నీయందుఁ జావఁబోవువానియందు మంచిమందులవలెఁ బనిచేయు చున్నవి కావు. రాజనీతి రెండువిధములుగా నున్నది. శత్రువున కాపద వచ్చినప్పుడు దుర్బలులైనవారు వాని సాధించి పగఁ దీర్చుకొనవలెను. ఉత్సాహము, బలము గలవార లెప్పుడైనఁ బగవాని నెదుర్కొనవచ్చును. ప్రస్తుతము మన కపకార మొనర్చిన సింధుదేశాధీశ్వరునిఁ బౌరజానపదు లంతగఁ బ్రేమించుటలేదు. కాన వాని కిది యాపత్సమయము. కాకున్న మాత్ర మతఁడేమి చావు, ముసలి తనము లేకుండ శిలకొట్టుకొని బ్రతుకఁగలఁడా? నీకుఁ దగినమిత్రులఁ బ్రోవుసేసికొని, కొండలను దుర్గము లొనర్చుకొని తిరుగుచు, సమయము చూచి వాని నెదుర్కొనుట యొకపక్షము.

మహాప్రాజ్ఞుఁడు, శాస్త్రదృష్టి, యగు నొక బ్రాహ్మణ సత్తముఁడు నీకుఁ జిన్నతనమున నామకరణ మొనరించి వీఁడు గొప్ప కష్టదశ నొంది, మరల మంచి బుద్ధి గలిగి యుత్తమసౌఖ్య మనుభవించు నని చెప్పెను. ఆమహా

త్మనివాక్యము నవలంబించి యింతగా నీజయముఁ గోరి చెప్పుచుంటిని. అనామకుఁడవు కాకుము. సంజయుఁ డను నీనామమును సార్థక మొనరించుకొనుము. ధనము లేనివాఁ డధముఁడు. ఎవనికి రేపటికిఁగాని యీపూటకుఁ గాని తినుట కేమియు లేదో వాఁడు దరిద్రుఁడు. అంతకంటె దుర్దశ యనునది వేఱ లేదని శంబరుఁడు చెప్పెను. ఇంక నావృత్తాంతము కొంత చెప్పెదను వినుము.

నేను మహావీరధనులగు క్షత్రియోత్తముల యుత్తమ కులమునఁ బుట్టి యట్టిద యగు మహాకులమునకుఁ గోడలనై వచ్చితిని. చిన్నప్పుడు కొంత యాయుధవిద్యయందు శ్రమ మొనర్చితిని. వ్యూహములు పన్నుట, భేదించుట నాయెఱుఁగనివి కావు. గురుశుక్రనీతు లభ్యసించితి. మునుల మతము లన్నియుఁ దెలియుదు. మొదట నాతండ్రియు సోదరులు నన్నడిగి రాచకార్యములయందు సంధివిగ్రహాదుల నిశ్చయించెడివారు. పిదప నానాథుఁడు నన్ను గౌరవించి సర్వాధికారముతో సర్వకళ్యాణముల నొసంగి రాజనీతియందు నామతము సిద్ధాంతీకరించి నడచెను. అనేకపర్యాయములు నే నామహాత్ముని యుద్ధములలోఁ జేదోడువాదోడై యుద్ధరించితిని. అమూల్యములగు సొమ్ములు, పూలు, దివ్యములగువస్త్రములు ధరించి, సంతుష్టనైయున్న నన్నుఁజూచి సంతసించు బంధుజన మీదశలో నావలన నెంత దుఃఖ మనుభవించుచున్నది! రామ! రామ! ఇంత కష్టము నా కేల

రావలెను? బ్రాహ్మణునకు లేదని చెప్పవలసివచ్చిన నాహృదయము పగులును. ఇంతకుఁ బూర్వము నేనుకాని నాభర్తకాని బ్రాహ్మణుఁ డడిగినవస్తువును లేదనలేము. అందఱకు నాశ్రయభూతులమై యొకని నపేక్షింపక జీవించిన మేము నీమూలమున నిట్టిదశఁ జెంది బ్రదుకుటకన్న చచ్చుట మేలు. అపారమగు నాపత్సముద్రములో మునుఁగుచున్న మమ్ము నుద్ధరింపుము. లేకున్న నీహీనపు బ్రదుకేటికి? గుండెలు పగిలి చావుము. నేను, నీభార్య, కూటికి గుడ్డకు లేక నేదవడియుండఁ జూచుచున్న నీవు బ్రదికియున్నవారిలెక్కలో నిప్పుడును లేవు. మనభృత్యులు, పురోహితులు, ఋత్విక్కులు, గురువులు, రాజబంధువులు, పొట్ట నిండించుకొను నుపాయము లేక మనల విడిచి హీనవృత్తిపాలువడ నింక మన బ్రదుకు గాల్పనా? రాజనీతిలో ముఖ్యమగు పక్షముఁ జెప్పెద వినుము. ఇంద్రుఁ డొక్కవృత్రాసురునిఁ జంపి యెంత కీర్తి సంపాదించెను? వేదములు పురాణము లన్నియు వేనోళ్ళ నా యపదానమును బొగడుచున్నవి. రణరంగమున నిలఁబడి పేరు చెప్పి శత్రుసేనలఁ గలంచి సేనాపతిని బొటబ్రోలి ప్రసిద్ధుడగు నొక్కవీరుని స్వయముగా నసహాయుఁడై జయించిన వానికీర్తికిఁ బరిమితి యుండదు. లక్ష్మి వాని వరించును, రాజులెల్ల వానికి నమ్రులౌదురు. చచ్చిన నింద్రుఁడు పూజింప వీరస్వర్గసౌఖ్యము లెల్లఁ జూరగొనవచ్చును. స్వర్గద్వారమువంటిదియు, యమృతమువంటిదియు, నగు

నీరాజ్యభోగమున కడ్డము వచ్చినశత్రువులమీఁదఁ గొఱవి వలెఁ బోయి పడుము. మనవార లేడ్చుచుండఁ బరులు సంతసించుచుండ దీనుఁడ వైన నిన్నుఁ జూడలేను. నాయనా! కులము రూపము విద్యయుఁ గలిగి యెద్దువలె భారమెల్లఁ దాల్పఁ దగిన నీయట్టివాఁడు తప్పుచేయుట చచ్చుటయె. పూర్వము సౌవీరకన్యలచే హర్షముతోఁ గొనియాడఁబడు నీవు సైంధవకన్యలహాస్యములపాలు కాకుము. జీవితసంశయ మైన యప్పు డెదురు తిరుగవలెఁ గాని వంగి తప్పించుకొని బ్రదుకరాదు. మనవంశములో నెవ్వఁడు నొకనివెంబడిఁ బడి యాశ్రయించి తిరుగ లేదు. అది నీకుఁ దగదు. అసహాయుఁడ వై కాని, ససహాయుఁడ వై కాని, శౌర్యముతోఁ బాపాత్ముల నడంచుచుఁ, బుణ్యుల నరసి కాపాడుచు, మూఁడువర్ణములచే మ్రొక్కులు గొనుచు, ధర్మ మని బ్రాహ్మణులకుమాత్రము నమస్కరింపుము.

యు—ఉక్కుముక్కతో నీహృదయము చేసియుండవచ్చును. తల్లీ! దయారస మెఱుఁగవు. వీరప్రజ్ఞురాలా! రోషపరవశురాలా! నీ రాజనీతి యెంత బాగుగానున్న దమ్మా! సవతితల్లివలె నసహాయుఁడనై యొక్కఁడ నైన సుతుని నన్ను యుద్ధము చేసి చావు మనుచుంటివి. తర్వాత నీరాజ్యభోగాదులవల్ల నేమి బావుకొనియెదవు?

ము—సంజయా! లోకుల కీదశాభేదము లెల్ల ధర్మార్థముల కొఱకే యేర్పడినవి. వానిని విచారించియే యే నింత చెప్పు

చుంటివి. పరాభవము నొంది భయపడియున్న నీకు శాస్త్రవిదిత మగు మార్గము నుపదేశించి బాగుచేయలేని నా ప్రేమ గాడిదపుత్రప్రేమవలె నిరర్థక మగును. నీయందు ధర్మమునకు నర్థమునకు సంబంధించిన సద్వృత్త ముండిన నాకుఁ బ్రేమ మేలయుండదు? అభ్యుదయము లేక యవినీతుఁడు, దుర్బుద్ధి యగువానిఁ బుత్రుఁడని, మనుమఁడని ప్రేమించువారి ప్రేమ వ్యర్థ మైనది. విధివిహితము లగు కర్మములఁ జేయక నిందితములగు పను లొనర్చు పురుషాధము లీలోకమునఁ బరలోకమునఁ గూడ సుఖమును జెందరు. క్షత్రియుఁడు యుద్ధము సేయుటకుఁ బుట్టెను. జయము వానిసొమ్ము. జయించినఁగాని చచ్చినఁగాని క్షత్రియుఁ డింద్రునిచేఁ బూజింపఁబడును. శత్రుగృహమునఁగాని, బుణ్యమగునింద్రభవనమునఁగాని, జయించి మిత్రులఁ బెట్టుకొని కీర్తితో ననుభవించునంత సంతోషకరమగు సౌఖ్య మింకొకటి యుండదు. ఓడిపోయి రోషముచేఁ దగులఁబడుచున్నవానికిఁ దానో శత్రువులో చావకున్న నెట్లు శాంతి కలుగును?

యు—తల్లీ! ఈబుద్ధి నీవుచెప్పఁదగినది కాదు అందులోఁ బుత్రుని కసలు చెప్పరాదు. ఇంచుక దయ దలఁచి యూరకుండుము.

ము—ఇందువలననే నాకు మహాపద ప్రాప్తమైనది. ఇప్పటికి నీమనసు తిరుగ లేదు. నే నింతగాఁ జెప్పుచుండ నాతో నాశ్చర్యముగ నూటలాడుచుంటివి. ఇది యిట్లుంచుము.

నాకు సెల విమ్ము. నీకుఁ దప్పక జయము కలుగునని నాకుఁ దోఁచుచున్నది. సర్వసైంధవులను సంహరించి నేను నీకుఁ బట్టము గట్టెదను. స్త్రీకి స్వాతంత్ర్యము లేదుగాన సెలవునకు నీయపేక్ష. నాయట్టిదాని నీయట్టివాని యధికారములోఁ బడవైచిన దైవము నేమని నిందింపనురా హీనుఁడా !

యు—ధనము, సహాయము లేని నాకు జయసిద్ధి యెట్లు కలుగునమ్మా ? నాకిట్టి దశ దైవమువలన సంభవించిన దని యెఱిగికొని పాపాత్ముఁడు స్వర్గమునువలె నేను రాజ్యము మీఁది యాస వదలితిని. అమ్మా! నీవు పరిపక్వమగు బుద్ధిగల నాపాలిదైవమవు. ఇట్టి నేను జయమునొందుటకైదైన నుపాయ ముండిన బాగుగా నాలోచించి చెప్పుము. నీ యాజ్ఞప్రకారము సంచరించి నిన్ను మెప్పించెదను.

ము—కుమారా! దారిద్ర్యము వచ్చినదని పురుషుఁడు తన్నవమానించుకొనఁగూడదు. అర్థములు నిత్యములు కావు. ఉన్నవి నశించుటయు, లేనివి వచ్చుటయుఁ గలదు. ఈ యర్థమును దెలిసికొని కేవలరోషముతోఁ గార్యముల నారంభింపక, సువిచారముతో ఫలముల సంపాదించుకొనవలెను. సువిచార మన నేది యందువా? ఏఫలమైనఁ గావలెనని కార్య మారంభింపనివాని కాఫల మెన్నఁడేనియుఁ జేసురనే చేకురదుకదా. కావలెనని పనిఁ జేయువానికి ఫలము వచ్చిన రావచ్చును, పోయినఁబోవచ్చును. అత్యంతాభావముకన్న సందిగ్ధమగు ఫలము కొంచెము

మంచిదికదా! ఎవనికి సర్వార్థము లనిత్యము లను జ్ఞాన మున్నదో, వానికిఁ గార్యము ప్రతికూలమైనప్పుడు మనో వ్యథ కలుగదు. ఈపని సఫలము కాఁగల దను మనో నిశ్చయముతో నభ్యుదయమును బొంది జాగరూకుఁడై మంచిపనులయందుఁ బ్రవర్తింపవలెను. బ్రాహ్మణులను, దేవతలను, శుభశకునములను, బురస్కరించుకొని తెలివి గలిగి ప్రవర్తించు రాజునకుఁ దప్పక మే లగును. సూర్యుఁడు దూర్పునువలె లక్ష్మి వానిని వెదకికొనుచుఁ దిరిగి వచ్చును.

పుత్రా! ఉపాయములు సామెతలు రోషము వచ్చు మాటలు చాలచెప్పితిని. ఇఁక నీవు పౌరుషముఁ జూపుము. సంతసించెదను. నీయిష్టము వచ్చిన పురుషార్థమును సాధింపుము. రాజైనవాఁ డెంత యాపద వచ్చినను భయపడరాదు. ఒకప్పుడు గుండెలు పగిలినప్పటికి నటు పరులకుఁ గనఁబడరాదు. ఇట్లు కనఁబడినచో రాష్ట్రము, సైన్యము, మంత్రులు, వే ఱగుదురు. కొందఱు శత్రువు లలోఁ గలసిపోవుదురు. కొందఱు ప్రభువును విడిచి పెట్టుదురు. కావున నీవు భయపడకుము. నిన్నితరులు నవ్వకుండ గంభీరుఁడవై నిలఁబడుము. నీకుఁ బౌరుషము ప్రభావము బుద్ధి యభివృద్ధి కావలెనని తేజస్కరములైన మాటలు చెప్పితిని. మనస్సును నిర్మలముగాఁ జేసికొని జయముకొఱకు బయలు వెడలుము. మనకుఁ గావలసినంత ధనముకలదు. అది నీవెఱుఁగకున్న నేమి? నే నెఱుఁగుదును.

నీకు నే సంపాదించి పెట్టెదను. సుఖదుఃఖముల కోర్చి నీ కొఱకుఁ బ్రాణములైన వెచ్చించుమిత్రు లనేకులు నీకుఁ గలరు. సమయము వచ్చినప్పుడు వారే నీకు సహాయులగుదురు. వారిని ముందుగాఁ బ్రార్థించుట యుత్తమ పురుషుని ధర్మము కాదు. మఱియొకప్పుడు వారు మనలఁ దెప్పకుండవలెను. అందఱ మిత్రులను బిలుచుకొని తన శత్రువునకు సరిపడనివారిని గలసికొని రాజావమాన కుపితులగు భృత్యులనుద్దీపింపఁజేసి పరులపై దాడి వెడలుట లోకసామాన్యమగు రాజధర్మము. అద్భుతమగు విక్రమము తనకుఁదాన చూపఁబూని యొక్కఁడ శత్రు నెదిరించి పోరాడుచున్నపుడు వానిమిత్రులు వెదకికొనుచు వచ్చిన రావచ్చును. రాకున్నను, ఆయుధముఁ బూని శాత్రువు డొక్కఁడు వచ్చి పిలుచుచున్నాఁడనిన నెంత సహాయసంపద కలవానికైన గొప్ప భయము కలుగక మానదు. దానివలనఁ దప్పక సంధియగును. తర్వాత నిలుచుండి కూర్చుండవచ్చును. పదిమంది సహాయు లున్నపుడు వందమందిని బ్రోవుచేసుకొనవచ్చును. మనప్రాణము నిత్యము కాదు. ఇది యుండఁగనే యాలోచించి కాలము గడపక శత్రువును జేరి యుద్ధమునకుఁ బిలువుము. తర్వాత యుద్ధమగునంతలోఁ జచ్చినను శాశ్వతమైన కీర్తి నిలువఁబడఁగలదు. ఈలోపల నేదైన యాపద సంభవించిన, మనభావ మెవరికిఁ బ్రకట మగును? రాజధర్మము కాలయాపనమును సహింపదు. నీకు ముమ్మాటికి జయ

మగుఁగాక గాదిలిబిడ్డా! యని కౌఁగిలించుకొని యామె యాతని శిరము మూర్కొని, చెవిలో నేమేమొ రహస్యము చెప్పెను.

ఇంతలోఁ బ్రొద్దు క్రుంకినది. ఆ యువకున కాఁకలి యెక్కడికో పోయినది. కార్యంచితాభార మెక్కు డయ్యెను. వాని కారాత్రి కనులకుఁ గునుకురాలేదు. రసభావముల యుద్రేకము మాహాత్మ్యము రసికు లెల్లరు నెఱింగినదియ. అప్పు డామసలమ్మ పుత్రా! "మనసంవాదము—సోమరులై లోకమున దైవవాదులగువారికి నుత్తేజన మొనరించెడిఁ గాత. శ్రేయస్కర మగు మనదారిని నడచువారు మనవలె సర్వదిగ్విజయమంది శాశ్వతకీర్తిఁగాంచెదరుగాత. నామాటలు మఱువకుము. సన్నద్ధుఁడ వగుము" అనుచుఁ బర్ణశాలలోనికిఁ బోయెను.

## ౪

## సింధురాజుతో రాయబారము

ఒకనాఁటిసాయంకాలమున నొకచోట నొక రాజకీయమగు సభాస్థాన మేర్పరుపఁబడెను. చాలమంది సామంతరాజులు పౌరులలోఁ బెద్దలు వచ్చి వారివారి మర్యాదల కనుకూలముగఁ దగినకుర్చీలలోఁ గూర్చుండిరి. తర్వాతఁ గొందఱు పెద్దపెద్దతలగుడ్డలతో మంత్రు లట వచ్చి కూర్చుండిరి. పిదప నచ్చోట నపూర్వముగాఁ దయారు చేయఁ

బడిన యుత్తమ సింహాసనమున నొక మహాప్రభువు వచ్చి కూర్చుండెను. అందఱుఁ జప్పటులు గొట్టిరి. దైవప్రార్థనతో మంత్రులు కార్యక్రమము నివేదించిరి. ఆరాజు నిండు మనస్సుతో ప్రజలక్షేమమును బ్రశ్నించెను. దేశస్థితి లెస్సగ విచారించెను.

అప్పుడు కొందఱు చారులువచ్చి యాయా దేశములలోని విశేషములు చాలగొప్పగాఁ జెప్పిరి. అవి వినినంతనే మంత్రులలో వాదములు చెలరేగినవి. భేదబుద్ధు లతిశయించినవి. ప్రభువునకుమాటలాడ నవకాశ మీయకపోయిరి. వినాశకాలే విపరీతబుద్ధిః అను లోకవాద మాయెడ సార్థకమయ్యెను.

అట్టిసమయమున నొక్క పురుషుఁడు లేచి నిలఁబడి పెద్దగొంతు క్రోసుదూరమునకుఁ జెవిలోఁజెప్పినట్లు వినఁబడుచుండ నుత్సాహముతోఁ బట్టుదలతో నిర్భయముగా నిట్లు చెప్పఁజొచ్చెను.

"రాజేంద్రా! మంత్రులారా! సామంతులారా! నామనవి శ్రద్ధతో నవధరింపుఁడు. నేను సౌవీర దేశమునుండి వచ్చిన ప్రజాప్రతినిధిని. మా దేశస్థు లెల్ల రేకగ్రీవముగాఁ జెప్పిపంపిన సందేశము నిదె వ్రాకుచ్చుచుంటి. రాజు అనగాఁ దల్లివంటి వాఁడు. ప్రజలెల్లరు బిడ్డలు. కావున వారికి నన్యోన్య ప్రేమ కలుగుట తప్పు కాదు. రాజునకుఁ బ్రజ శరీరమువంటిది. రాజా ప్రజకు నాత్మవంటివాఁడు. కావున రక్షణముచేతను సేవచేతను నొకరి నొక రనువర్తించి భాసిల్లవలెను. మేమెల్ల మొదలింటి నుండియు మారాజునెడ నట్లు ప్రవర్తించు

చుంటిమి. మమ్మా రాజచంద్రుఁడు నట్లు కాపాడుచుండెడి వాఁడు. ఆతఁడేయననేల? వాని పెద్దలెల్లరుఁ దరతరములనుండి ప్రజలమీఁద నీఁగ వ్రాలకుండఁ గడు జాగ్రత్తతోఁ బరిపాలించిరి. రాజు లుత్సాహము కలిగి యొకళ్ల నొకళ్లు జయింప నెంచి సంగరరంగమునఁ బ్రాణములు తృణములుగా నొడ్డుట తప్పుగాదు. కాని శత్రువుల నోడించినను వారిరాజ్యమున వారినే నిలిపి తాము వారివలనఁ గప్పములు గైకొనుచుఁ బరహితము నాత్మగౌరవము దక్కించుకొనుట రాజధర్మము. ఓటమియు గెలుపును దైవాధీనములు, మర్యాద రక్షించు కొనుటకు మాత్రము పురుషుఁడు ప్రయత్నింపవలెను.

"ఒకఁడు సార్వభౌముఁడై పన్ను గైకొనుచున్నను, ఏ దేశమున కా దేశస్థుఁడు రాజుగా నుండి యారయకున్న నితర దేశధర్మము లాయా దేశములయందు వ్యాపించి కులములు తెగలు ధర్మములు సంకరము నొందును. దేశమును గాలమును బురస్కరించి ధర్మములు వేదశాస్త్రములచే నిర్ణయింపఁబడియున్నవి. వానిని సంస్కరించుటకు మనకేయధికారమును లేదు. మంత్రద్రష్టలగు మహామునులనంతమగు వేదరాశిఁ దఱచి యనేకముఖమగు నాధర్మము నాచారపరంపరచే నిహపరసాధకముగ సమర్థించి యున్నారు. అట్టి యాచారము లేదేశమునకైనఁ దగినరాజు లేకపోయినప్పుడు తప్పక చెడిపోవును.

"ప్రస్తుతము మీరు మారాజు నోడించినప్పుడ మా రాజ్యము మీయధీన మయినది కాని, మాయాచారము

కాలేదు. మొదట మాధర్మములవిషయములో నుపేక్షించి యట్లుండి యిప్పటి కది యంతయు మీయధీనము చేసుకొని ప్రజాభిప్రాయమును విచారింపక మీకు దగినకొందఱుద్యోగుల యిష్టము ననుసరించి శాసించుచున్నారు. అది కేవల మన్యాయము.

"ఇదియునుగాక, భగవంతున కెల్లరు సమానులే. అట్టిచో నిన్నటివఱకు రాజార్హసౌధములలో నుండి యెండ కన్ను వానకన్ను నెఱుఁగని యామువారితో నట్టడవిం బడి మారాజు దుఃఖ మనుభవించుచుండ మా కేటి సౌఖ్యము? అట్టివాని నిట్లు సేయుట మీ కెట్లుధర్మ మయ్యెను?

"ఇది యంతయు మేము మీతో వాదము చేయుట గాదు. ముఖ్యాంశము వినుఁడు—ఎప్పటియట్ల మారాజును బిలిపించి సౌవీరరాజ్యసింహాసనమున నిలిపి యాతనివలన మా పరిపాలనము నడిపించుచు మీరుపైనఁ గనిపెట్టియుండి తగిన యరిగైకొనుచు మాయార్థికసమస్యకుఁ దోడ్పడుచు మీ చక్రవర్తిత్వము నేకాధిష్ఠిత మొనర్చుకొనియెదరు గాత మని మే మెల్లరము దేవునిఁ బ్రార్థించుచున్నాము. అట్లు మాకోరిక లీడేరకున్న మేమెల్ల సర్వార్థములఁ ద్యజించి యడవులపాలై పోయెదము. అరణ్యనిర్విశేషములగు నూళుల మీ రేమి చేసికొనినను సరియే."

అనుచు నింకేమేమో చెప్పఁబోవుచుండ నచ్చటి మంత్రులు సామంతులు నొకరిమొగము లొకరు చూచు

గొనుచు నాపురుషునితో—మీప్రజల యభిప్రాయము తెలిసి నదికదా. మే మాలోచించెదము లె—మ్మని బలవంతముగా నాతనిఁ గూర్చుండఁబెట్టిరి. అచ్చటిప్రభువు సింధురాజనియు నది సింధుదేశరాజస్థానమనియుఁ బ్రసంగమునుబట్టి తెలియు చునేయున్నదికదా.

ఇంతలో నొక జవాను వేగముగా వచ్చి-మహారాజా! జయము జయము. ఎవ్వడో యొక మహావీరుఁడు ఖడ్గధరుఁడై కాలినడకతో నిరువురుస్త్రీలు సహాయముగ వచ్చి మనకోట వాఁకిట నిలఁబడి నన్నుఁ బిలిచి "ఓరి, మీ రాజేంద్రునితోఁ జెప్పుము. ఈమాటు యుద్ధార్థియైవచ్చిన సౌవీరకుమారుని జయించుట నీతరము కాదనుము. ఎవ్వరెవ్వరు తనకుఁగలరో వారినెల్లఁ బిలిచికొను మనుము. అసహాయశూరులగు సౌవీరులనెవ రెఱుఁగరు! పొమ్ము. ధర్మము నెంచి యిచ్చట నిలఁబడితిని. తగినసమాధాము లేకున్న ఫాలాక్షుఁడడ్డమువచ్చి నను మాఱులేక పెనఁగి యీరాత్రి గడవకమున్నె నిన్నంత కాంతికమునకుఁ బనిచెద. చెప్పు," మని యనెను. వానిమూర్తి చూడఁ గడు ఘోరముగ నున్నది. దేవర ప్రమాణ మని వణఁకుచు నూరకున్న సభ్యు లెల్ల నిర్వాఱపడిరి. అనేకు లనేకవిధములఁ దలపోసికొనుచుండిరి. ఆసింధురాజు తన ప్రధానామాత్యునితో నేదియో రహస్యముగఁ బ్రసంగించి, యందఱకు సెలవిచ్చి నాఁటికి సభ చాలించి యంతిపురము నకుఁ బోయెను.

## ౫

## సింధురాజు ప్రతిసందేశము

ప్రొద్దుక్రుంకినది. పడమ రెఱ్ఱబడినది. ఒకొక్కటిగఁ జుక్కలు పొడసూపుచుండెను. ఆసమయమున సంధ్యాకార్య ముందీర్చి కోటతూర్పు వాఁకిలివద్దనున్న సౌవీరవీరుని కుడి వైపున నున్న ముసలమ్మయు నెడమప్రక్కనున్న తరుణియు నత్యుత్సాహముతోఁ దేజరిల్లుచుఁ దమచూపులు, భావములు నాపురుషు నత్యంతపరవశుఁ జేయఁ గయ్యమునకుఁ గాలు దువ్వుచుండిరి. ధర్మవేది యగు నవ్వీరుండును నిశ్చింతుఁడై మహోత్సాహముతో వార్త కెదురు సూచుచుండెను.

అప్పుడు కాల్యకృత్యములందీర్చి తగిన వేషముతో నొక యుద్యోగి యచ్చోటికి వచ్చి యారాజకుమారు ననామయ మడిగి యింతనంతనుండి యిట్లు మాట్లాడఁజొచ్చెను.

ఉద్యోగి—వీరోత్తమా! ఏమి నీయభిప్రాయము ?

సౌవీర వీరుఁడు—మీరాజేంద్రు నెదిరించి పౌరుషము ప్రకటించి యిహపర సౌఖ్యములఁ జూఱఁగొనుటయే.

ఉ—ఆశ్చర్యముగలుగ నుడువుచుంటివి. మారాజేంద్రుఁ డనిన నొక తృణ మనుకొంటివా? మృగ మనుకొంటివా? తురంగతరంగములతో, ద్విపద్వీపములతోఁ బొంగివచ్చు ననేక సైన్యసాగరములనడుమ వరుణదేవు ననుకరించుచుఁ బ్రతిపక్షదుర్నిరీక్ష్యుఁడై పరాక్రమించు సింధురాజు నెఱుఁగని వాఁడవు కావు. నీ వొక్కరుఁడవు, నీకుఁ దోడీ

ముసలమ్మ. మి మ్మిద్దఱ నీయబల రక్షించుఁ గాఁబోలు. ఉత్సాహము కలిగి రాజులు పగఱ జయింపవచ్చుట దొసఁగు కాదు. నీకుఁ దగినవారిఁ గొందఱఁ దెచ్చు కొనకపోయితివా ?

సౌ—అమాత్యవర్యా! ఎంత పిచ్చివాఁడవు! శాత్రవుఁ డొక కొండ యనుకొనిన నెవ్వఁడుత్సాహముతో వాని నెదిరింపఁ గలఁడు? ఇప్పుడు నాదృష్టికిమీరాజు తృణమును గాఁడు. తరంగములు, ద్వీపములు, సాగరములు నాయెఱుఁగనివి గావు. వరుణదేవుఁడు మాత్రము దేహధారి కాఁడా? జరామరణవశులగు మానవుల జయించుటకుఁ గూడ నొక పరికరము కావలెనా? వీఁడు నాఁటిసంజయుఁడు కాఁ డనుకొనుము. ఇప్పటికి నా కోల్తలకు సహస్రాక్షుఁడు నొక సరుకుగా నుండలేదు. సర్వథా దైవము నాకు సహాయము కావలెను.

ఉ—ఓయీ! నీమాటలు హాస్యాస్పదములుగా నున్నవి. అట్టి యసహాయశూరత కలిగిన నీయబలలతో డాసపడి తెచ్చు కొనుట యేటికి?

సౌ—పిచ్చివాఁడా! నేను తెచ్చుకొంటినా ? ఎవరివిధిని వా రనుష్ఠించుచున్నారు.

ఉ—ఇట్టివిధిజ్ఞుఁడ వప్పుడు పరాభూతుఁడవై యేలతలఁగితివి?

సౌ—అదియు విధియధీనతయే.

ఉ—ఐన నిన్నిప్పుడు విధి రక్షింతునని యభయ మిచ్చినదా?

సౌ— భయముండినఁగదా యభయ మీవలెను? విధి తప్పక తోడుపడుననియె నాయభిప్రాయము.

ఉ—అట్లైన రాజబంధువులు మిత్రులు సహాయము కాకుందురా?

సౌ—ఆ హేతువాదము లిప్పు డనవసరములు. మీరాజును యుద్ధరంగమున కియ్యెడ నడిపించెదవా! లేదా?

ఉ—మారాజు నీబోటి యసహాయునితో యుద్ధము సేయఁడు.

సౌ—మంత్రిముఖ్యా! నేనసహాయుఁడఁగాను. ఇదుగో, చేతిలో ఖడ్గముఁ జూడుము. యుద్ధము సేయననిన, వాని విడిచి పెట్టిపోయెద ననుకొంటివా?

ఉ—ఏమి చేసెదవు?

సౌ—మహావేగముతోఁ గోటలో దూరి యడ్డమైనవారి నెల్ల సంహరించుచుఁ బోయి యాతనిఁ గెడపి సింహాసన మెక్కెదను.

ఉ—నీవే?

సౌ—ముమ్మాటికి నేనే. సౌవీరకులజాతులకీ నీ బెదరింపులు నెమ్మనముఁ ద్రిప్పఁజాలవు.

ఉ—అట్లైన మారాజు సంధి సేయునేమో?

సౌ—శత్రువుఁడు ప్రబలుఁడైనప్పుడు కదా సంధి? ఒక్కని తోడి యెదురుపడక కాళ్ళ బేరమునకు వచ్చునంతటి యసమర్థుఁడా మీఱేఁడు?

ఉ—కాదు కాదు. ఇట్టిదుర్దశలో నున్న నీపైఁ గరుణించి సౌవీరరాజ్యమునకు నిన్ను నియుక్తునిఁగాఁ జేయవలెనని నిన్నటినుండియు మే మాలోచించుచుంటిమి.

సౌ—ఏమేమీ? మీరా నాదుర్దశఁ బాపువారు? మున్నే యేల యట్టిపని సేయరైరి? సౌవీరశత్రుంజయరాజన్యుని పుత్రుఁ డొకనికరుణ నపేక్షించునంత హీనుఁడు కాఁడు. మీ రిచ్చినను రాచపోచనైన నాకూరక పుచ్చుకొనుట ధర్మముకాదు. రణరంగమున జయించి రాజధర్మముఁ బురస్కరించి రాజ్యలక్ష్మిఁ జేకొనియెదఁగాక.

ఉ—రాజన్యకుమారా! నీకు మేలగుఁగాక. నీనిశ్చయమిట్లున్న యెడల మాకున్నవానిలో నీయిష్టమువచ్చిన వాహనాయుధముఖపరికరములఁ గైకొని యుద్ధసన్నద్ధుఁడ వగుమని మారా జానతిచ్చినాఁడు. అట్లొనర్పుము.

సౌ—యుద్ధయున జయింపకమున్ను శాత్రవుల వస్తువు లుత్తముల కెట్లు పరిగ్రహింప వచ్చును? నా కవి యన్నియు నేల? మాతండ్రి గారిచే నీయఁబడిన యిమ్మండలాగ్ర మొక్కటియ చాలును. దీనిసహాయమున ముల్లోకములు జయింపఁగలను.

ఉ—మహావీర! ఇన్నిమాటలేల? రేపు నీయిష్టము వచ్చినట్లు సేయవచ్చును. ఈ నాటికి మా మహారాజుగారు తమ కొక విడిది నేర్పాటుచేయుమని చెప్పిరి. నేను నల్లదె మహాసౌధ మొక్కటి సిద్ధపఱచి వచ్చినాను. నీవును నీ

సహాయులు నెల్లభోగములతో నీరాత్రికి నందు విశ్రమింపుఁడు. మారాజున కెట్లట్ల నీకును మర్యాదలెల్ల జరుగఁగలవు.

సౌ—సహృదయోత్తమా! మీపూజావాక్యముల కేను సంతసించితిని. కాని రాజధర్మ మట్టులొప్పకొనదు. వేయి మాట లేల? శత్రువుల జయించి కాని నేనుపురములలో నడుగిడను. అటు లడుగిడుటయు నీతి గాదు. పొమ్ము. సత్వరముగా యానగుణము ననుసంధింపుము.

ఉ—శూరోత్తమా! నీయుద్యోగ మిట్టిద యైన రేపటిసూర్యోదయానంతరమున మారాజు కోట వెలువడఁగలఁడు. నీవు సన్నద్ధుఁడవై యుండుము.

సౌ—గుణశాలీ! ఇదె మీరు వచ్చినదాఁక నిట్టులే నిలిచి యుండెదను. యుద్ధరంగము నిర్దేశించి మీ రచ్చట భేరి వాయించినప్పుడ మి మ్మెల్ల మారొ్కనియెద.

అంత జిత్తమని యాతఁడు లేచిపోవుచు, "ఔరా! యీ రాజన్యుఁ డెంత కీర్తి సంపాదించినాడు! ఇంతవఱకు మాటలతోనే రాజధర్మము వెలయించినాడు. యుద్ధమునఁ గూడ జయించెనా, వీనియశమున కంత ముండదు. కాకున్నను వీర స్వర్గము లభించును. ఈతని యీ యుద్యమమున కాతల్లియే మూల మని తోఁచుచున్నది." అని తలపోసి యాతని మెచ్చుకొనుచు రాజగృహద్వారము సమీపించెను.

౬

## సంజయ సింధురాజుల యుద్ధము

పరాక్రమశాలియగు నొకవీరపురుషుఁ డున్నతమగు నొక్క వారువము నెక్కి ఖడ్గహస్తుఁడై యతిత్వరితగతిఁ బరుగెత్తుచు వచ్చుచుండెను. అక్కడ రేఁగిన దుమ్ములో భూమియు నాకసమును గానవచ్చుటలేదు. పరికించిచూచిన వానివెంట నిరువదివేల గుఱ్ఱపుదళముకలదు. వారెల్లరుత్సాహవంతులు నుద్ధతులు. వారందఱు చెవులు దోరలువెట్టుకొని చప్పుళ్ళు వినుచు సైన్యపరాగ మీక్షించుచు వచ్చుచుండ వారిలోఁ బ్రధానుఁ డెలుఁగెత్తి యిట్లు పలుకఁజొచ్చెను.

“జనులారా! సింధుసౌవీరభూపతులయుద్ధరంగ మెచ్చట? నాపేరు ప్రభంజనదాసుఁడు. నేను మిక్కిలి రాజభక్తితాత్పర్యము కలవాఁడను. వీరపత్నియగు విదులామహాదేవి నన్నింతవానిఁ గావించెను. ఇన్నినాళ్ళదాఁక నామెఋణముఁ దీర్చుకొను మార్గము దొరకినదికాదు. అశ్వశాస్త్రము, యుద్ధమర్మములు నా కాయమ యుపదేశించినది. ఇప్పుడు నాప్రాణములు నాపరివారము వైదులేయుని యధీనములు సేసి యుభయలోకసౌఖ్యముల ననుభవించెద. నాయట్టి ధన్యుఁ డెందైనఁ గలడా! నే నీ ప్రాణములతో నాయమ కేమి యుపకారము సేయఁగలనని తలపోసికొనుచుండ దైవము నాకీమేలిట్లు సంపాదించినది. నా విక్రమమునకు సింధురాజు సైన్యసాగరము గోష్పాదమాత్రమును గాఁజాలదు. ఏమనె

దరు......మూఁడుమైళ్ళ దూరమున యుద్ధరంగము పొమ్మ
నియా? ఇదుగో మూఁడంగలలోఁ బోయెద" ననుచుఁ బోయి
పోయి, చూచి. ఔరా! ఇదియేమి యుద్ధము! ఎక్కడఁ
జూచియు వినియు నుండలేదు. అసంఖ్యములగు శత్రుసైన్య
ములలో మా రాజన్యుఁ డొక్కరుఁడే ఖడ్గపాణియు భూచా
రియునై పరాక్రమించుచున్నాఁడు. ఇంత సాహసముఁ జేసి
కీర్తియెల్ల నొక్కసారిగ సంపాదించినాఁడు చచ్చిన నేమి?
బ్రతికిన నేమి? రాచపుటుక యిట్లుండవలెను. సెబాస్! సం
జయ మహారాజా! నిర్జనారణ్యములో నిన్నాళ్ళు నులకకుక్కి
నాశ్రయించి యనామకుఁడవై యున్నను జివరకు మంచి
పని సేసితివి.. ఔరా! ఈ వీరునిఁ గాపాడుచు నా వీరమాత
వెనుకయై యెట్లు సైన్యలయము సేయుచున్నది! ఈ తల్లి
కొడుకులకన్న నా వీరపత్ని యుత్సాహము రోషము నాశు
విక్రమము సహింపఁ జాలక నా మొగము మొనలెల్ల పాఱి
పోవుచున్నవి. నామనస్సున కాయమ దుర్గాదేవిగాఁ దోఁచు
చున్నది. ఈముమ్వురు మూఁడు లోకములు జయింపఁ గలరు.
నాబోంట్లెల్ల యీ కార్యమున నిమిత్తమాత్రులై మర్యాదఁ
దక్కించుకొనుటయే ప్రయోజన" మనుకొనుచుఁ దొందర
తొందరగా నేగి రణరంగముఁ బ్రవేశించి యడ్డమైన సైన్యము
నెల్ల నఱకుచుఁబోయి విదులా వైకు లేయులకుఁ "దమ మూల
భృత్యుఁడు ప్రభంజన దాసుఁడు నమస్కరించు చున్నాఁడు;
నిరుపమానమగు స్త్రీశక్తి జయించునుగాక! విజృంభింపుడు;
ఇదె నేను గూడ వచ్చితి"నని తనగుఱ్ఱపు దళములతో సైంధవ

సైన్యసాగరము మథించు వాని యుత్సాహముఁ జూచి తల్లి యుఁ గొడుకును సంతసించిరి. ఆతరుణి కాతనిఁ జూచినంతటి నుండియుఁ జిత్తము పరి పరివిధములఁ బోఁజొచ్చెను. కార్య భారమున నదియెల్ల మాని ధైర్య మవలంబించి యా సుదతి కాలముఁ గడపెను.

ఇట్లు విధివిరామము లేకుండ నాముచ్వురు వారికిఁ దోడు తన పరివారముతోఁ బ్రభంజనదాసుఁడు ప్రొద్దు క్రుంకునందాఁకఁ బోరి వైరివీరుల పీచమడఁచిరి. అప్పుడు కాలముపై నెపము వెట్టి సింధురాజు సైన్యమును దివియించి నాఁటికి యుద్ధముఁ జాలించి ప్రతివీరుని యుత్సాహమును దైవ బలమును మెచ్చుచు శిబిరమునకుఁబోయి మఱునాఁటిప్రయత్న ములోనుండి జంఘాలు రగు చారులఁ బిలిచి తనకుఁ గలవారి నెల్ల నాహ్వానింపఁబుచ్చుచుండెను.

ప్రభంజనదాసుండును సైన్యమును విశ్రమింపఁజేసి చిన్న చిన్న శిబిరముల నేర్పాటుసేయించి తగురీతి విదులా వైదులేయుల సేవించుకొనుచు నాసుందరింజూచి 'తల్లీ! కోప దృష్టితోఁ జూడకుము. నేను నీసోదరుఁడ. మొదటి నావ్యతి క్రమము క్షమ్మట మనవిచేసుకొనెద' నని, 'యదియేమి,' యని యడిగిన తక్కినవారికి నన్నై చెప్పి, యాతఁడు విశ్రమించెను.

ఆసమయమున నపరిమితము లగు చతురంగసైన్యము లతో విదర్భరాజేంద్రుఁడు 'సౌవీరసేనానివేశ మెక్కడ?' యని యడుగుచు వచ్చి విదులామహాదేవిచరణములకు నమస్క రించి యనంతరము తనకు మ్రొక్కిన సంజయుఁ గౌఁగిలించు

కొని మూర్ధాఘ్రాణ మొనరించి యాతనికాంతను దీవించి, 'రాజపుత్రా! నీ నిరుత్సాహమున నేమియు సేయఁ జాలక యూరకుంటిమికాని, మే మేమి యసమర్థులమా! భాగి నేయా! ఇందఱము గల్గిన నాడువారు సహాయముగ సాహ సించి యొక్కరుఁడవు శత్రుసైన్యముల నెదుర్కొనవచ్చునా! ప్రభు మంత్రశక్తులతోడ్పాటు లేని కేవలోత్సాహమును నమ్మి యిట్లు తెగఁ బడవచ్చునా ? ఇంక నాసహాయముతో నింద్రునైన జయింపుము. ఆడువారి నింట నుండని' మ్మని యాశ్వాసించి డేరాలు వేయించి సైన్యముల నెల్లఁ దగురీతి విడియించి యాటపాటలతోఁ బ్రొద్దుపుచ్చుచు సుఖముండెను.

కొంతసే పైన తర్వాత నందఱు సుఖనిద్ర నొందిరి. వేఁకువజామున వందిమాగధులపరాకులతో నిద్రలేచి భద్ర కరి బృంహితములు వినుచు నారాజకుమారుఁడు మేన మామయుఁ దాను గాలకృత్యములం దీర్చి ప్రభంజనునితోఁ గూడ సన్నద్ధుఁ డగుసమయమున. 'విదులామహాదేవికొడలు, సౌవీరసంజయమహారాజుదేవేరి యగు భాగ్యవతి యెచ్చట?' నని యడుగుచు వచ్చి రథము డిగి యాయుధహస్తుఁ డై యొక వీరవరుఁడు లోనికేగి పూజ్యులకెల్ల నమస్కరించుచుఁ బోయి చరణములపై వ్రాలెను. వానిం జూచి భాగ్యవతి 'ఓరీ తమ్ముఁడా! నన్ని మహారాజు కిచ్చిననాఁడె మీభారము తొలఁగిపోయినది! కని పెంచిన తండ్రియైన నిట్లు సేయునా? నీవిట్టివాఁడ వని యెఱిఁగియే యాపద నాపికొనుటకు నా తండ్రి నా కాయుధవిద్య చెప్పించెను. నాథునియాన లేక

కష్టములపాలైతిని గాని సైంధవసైన్యసాగరము నాకు మోకాటిబంటి గుంటయుఁ గాదు. ఇట్టిసమయమున వచ్చి యుత్తచేతులతో నూరార్చిపోఁ జూచుచున్నావుకాబోలు!' అని కన్నీరు పైటచెంగున నొత్తికొనెను. ఆమాటలు విని యందఱకు మనసు కరగిపోయినది. అనేకవిధములుగ నెల్లరు నూరార్చిరి. అప్పుడా తమ్ముఁ డక్కగారికి మరల నమస్కరించి, 'తల్లీ! నన్నిట్లేల వాక్ఛల్యంబుల గ్రుచ్చెదవు? రాజధర్మము ననుసరించి నీనాథునియుత్సాహము లేక మే మేమియుఁ జేయరాక కాలము గడపుచుంటిమి. మీ రడవిపాలైనదిమొదలు రాజ్యములోనుండియు మేము సుఖ మనుభవించుచున్నా మనుకొంటివా? ఇప్పుడే విదులాసోదరుని యాస్థానకవి మీవృత్తాంతము సాకల్యముగాఁ జెప్పిన విని నంతనే మనసు నిలువక మంత్రిసేనాధిపతులకుఁ దగు సంభారములు సైన్యము లాయుధములు తెమ్మని యాజ్ఞాపించి నేను ముందర వచ్చితిని. సోదరీ! మీకెల్లవిధముల దైవము మేలు గూర్చుఁగాత,'మని నానావిధముల నాశ్వాసించుచుండ రోకళ్లు కఱ్ఱలు తాళ్ళు తీసుకొని సౌవీరనగరప్రజలు వెదకికొనుచు వచ్చి వారి దర్శించి నమస్కరించి, 'సౌవీరశత్రుంజయకుమార సంజయమహారాజా! నీ బిడ్డలంబోలు ప్రజల విడిచి యేమని యిన్నాళ్ళడవులలోఁ దిరుగుచుంటివి? నిరాశ్రయులమై పరాక్రమింప రాదని యూరకుంటిమిగాని యీపాడుసైంధవరాజ్యము మాకేటికి? ఇవె మాప్రాణములు నీయధీనము,' లని పలుకుచు నాతనిచే నాదరింపఁబడి యెల్లవారు నొక్కయభి

ప్రాయముతో విదులాభాగ్యవతుల శిబిరమునుండి సన్నద్ధులై యుద్ధమునకు వెడలిరి.

దైవ మననిట్టిది. తల్లి, భార్య సహాయముగాఁ దెగించి యుద్ధమునకు వచ్చినవాఁడు స్రమాట్టగుచున్నాఁడు.

## ౭

## సంజయుని విజయము

ఈ విధమునఁ బదునాల్గు దినములు యుద్ధము జరిగినది. సైంధవునిచే మున్ను తిరస్కరింపఁ బడుచున్న రాజులెల్ల రొక్కరొక్కరుగ వచ్చి సంజయు నాశ్రయించిరి. వీని పూర్వవైరులు వానిరాజ బంధువులు మాత్ర మాపక్షమునఁ బెనఁగులాడు చుండిరి. పదు నేనవునాఁడు జయజయధ్వనులతో శుభశకునములతో విధి యొసంగు మహోత్సాహముతో సుదీర్ణుఁడై యా జిగీషువు 'నేఁడు సైంధవుఁ బ్రాణములతోఁ బట్టి తెచ్చెద నొండె, వధించెద నొండె. ఎట్లైన వాని రాజ్యలక్ష్మినిఁ బరిగ్రహింపక నేను వెనుకఁ దిరిగివచ్చి శిబిరము ప్రవేశింప' నని ప్రతిజ్ఞ యొనర్చి, వికసించిన తనవారి మొగములు చూచుచు వందులు కైవారములు సేయ బయలు దేరి పోయి 'నమోఽస్తున్మాత్రే విదులాయై' యని పొంగి వచ్చుచున్న శత్రుసైన్య సాగరము పాయవడఁ జొచ్చి వియచ్చరులు మెచ్చ హెచ్చి యచ్చతురంగంబుల రక్తప్రవాహం

బుల నోలలాడించెను. వాని సహకారుల వేఱ యెన్న నేల? ఒకఁడు విదులామహాదేవికిఁ దోడఁబుట్టినవాఁడు. వేఱొక్కఁడు భాగ్యవతీసోదరుఁడు. మఱియొక్కఁడు విదులాశిష్యుఁడు కదా! వారివారిపాలుతులతో వచ్చిన సామంతులు మిత్రులు వారికన్న నుత్సాహముతోఁ బోరాడిరి. వీరరససంపద మూర్తీభవించి యాజిగీషువును గౌఁగిలించిన ట్లుండెను. సర్వసర్వంసహాసామ్రాజ్యలక్ష్మియు మధ్యమనాయిక యై యోరచూపులు వానిపైఁ గ్రుమ్మరింపఁజొచ్చెను. అమ్మహాసంకుల సమరమ్మునఁ గొంతసేపునకుఁ బ్రధానులద్వంద్వయుద్ధములు సాగెను. ఎల్లవారలుఁ బ్రాణముల నాదరింపక పేరుఁ గోరి పోరాడిరి. అంత మధ్యాహ్న మైనది. ఉష్ణరవీథిఁ దేఱి చూడరాక తపనుఁ డెల్లవారి యొడలులఁ దనఖరకరములఁ జొనిపి పరితపింపఁజేసెను. రణరంగమును జూచి శూరు లూరకుందురా?

అత్తఱిఁ దీవ్రోత్సాహదీప్తుఁడై శత్రువులు మెచ్చుకొన నాసౌవీరుఁడు సింధురాజుమీఁదికి ఖడ్గైకసహాయుఁడై లంఘించుచుండ వానిసేనాధిపతి శత్రుజిత్తనువాఁ డడ్డము వచ్చి యచలుఁడై వీని నొప్పించెను. తర్వాతఁ గొంతతడికి శౌర్యధనుఁడగు నాసంజయుఁడు వానిప్రతాపము ఖడ్గధారాజలమునఁ జల్లార్చి యవార్యుఁడై దుమికి సాహసముతో సైంధవ గుఱ్ఱముల సారథిని నఱకి రథముపై కెక్కి వాఁడు కురియు నంపవానకు సహించి చేతివిల్లు విఱిచి వాఁడు కత్తిఁ గైకొనుసందున నాతనికేశములం గ్రహించి యాకర్షించి

తెచ్చి తనరథ స్తంభమునకుఁ బంధించి దిక్కులు బ్రద్దలగు నట్లు సింహనాదము సేసెను.

తక్కినవారు నుత్సాహముతో సైంధవుని మంత్రి సామంత సహాయులఁ బట్టుకొనిరి. హతశేష మగు సైన్యము శరణుఁ జొచ్చిన నభయ మిచ్చి యామెయిన పోయి వాని సర్వధనంబులఁ జూఱగొని మిత్రులు సేనలు ప్రజలు సంతస మున వెంటనంటి రా, నట్లు సైంధవుబంధం బరసికొనుచు శిబిరమున కేఁగి యారాజకుమారుఁడు విదులామహాదేవికి నమస్కరించెను.

అప్పుడు వెడలు నానంద బాష్పము లంతరాయముగా నతని తేజోమూర్తిఁ జూడలేక యాతల్లి, 'వచ్చితివా సౌవీర శత్రుంజయమహారాజకుమారకా! సార్థకనామా! సంజయా! నీమూలమున నాయుభయకులములు ప్రసిద్ధి నొందినవి. వీర మాత నైతిని. కొడుకువై పుట్టి మాతృఋణముఁ దీర్చితివి. ఇట్టి నాభాగ్యము నేన మెచ్చునట్టిది యయ్యెను. ఇప్పుడు విదులా శత్రుంజయుల యంగాంగములవలనఁ బొడమిన తేజోరాశి యని నిన్ను జగమెఱింగినది. ఇట్లే నిర్భయుఁడవై యెదిరించిన రాజుల నెల్ల నడంచుచు మధ్యమలోక మెల్ల నొక్క కత్తితో శాసింపుము. సమయము వచ్చిన దిక్పతుల నైన జయింపు' మని కౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణ మొనర్చి తన్నుఁ జేరిన సహాయుల నెల్ల నుచితముగ నాదరించెను. వీరపత్ని యగు భాగ్యవతి కప్పురపుటారతితో నెదుర్కొని మంగళాచార ములతో నాతని యుత్సవము మఱింత సేసెను.

మఱునాఁడు సౌవీరరాజధాని కేగి యథావిధి నారాజకుమారుఁడు పట్టాభిషేకసుఖ మనుభవించెను. ప్రజ లానందాబ్ధి నోలలాడిరి. మిత్రులు సుఖముఁ జెందిరి. శత్రులు భయమునఁ గ్రుగిరి.

అనంతర మారాజకుమారుడు పౌరసామంతపరివార పరీతమైన యాస్థానమున సింహాసన మలంకరించి, సైంధవు రావించి నిర్బంధు నొనరించి వాని కిట్లనియె—ఓసింధు దేశాధీశ్వరా! నీవు నాజ్ఞాతివి. యుద్ధమునఁ జచ్చిన వీరస్వర్గ మున మహోన్నతపదవి నుండెడువాఁడవు. దైవవశమునఁ జేతికిఁ జిక్కితివి. పౌరుషము నిరర్థకము. దైవము సర్వాధికము. కావున మనమున వగవకుము. నీరాజ్యము నీకిచ్చితిని. కైకొని యేలుకొనుము. నాకులమునఁ బుట్టిన నీకు హీన వృత్తి తగ దని యట్లు చేసితిని. మిత్రులఁ జేర్చుకొని శత్రుల జయించుచు మాకు నరి యొసంగుచుఁ గులమునకుఁ బేరు ప్రతిష్ఠ సంపాదింపుము. వీలైనప్పుడు నన్నేని మరల జయింౘెదుగాక - యని పలికి సగౌరవముగ వానిపదవి వాని కిచ్చెను. ఆమహాత్ముని యోగ్యతకు నందఱు శరీరములు పులకింప వేనోళ్ళఁ బొగడిరి.

అంత నాసింధురా జిట్లనియె—మహారాజ! నేను పరాక్రమజితుఁడ నగునీదాసుఁడను. నీశాసన మతిక్రమింప నసమర్థుఁడను. కాని యాశాసనములోని చివరవాక్యము మాత్రము సవరణచేసి యెల్లప్పుడు నీకుఁ గుడిభుజము వోలెఁ దోడై నీజయమె నాజయము యని సంతసించున ట్లను

గ్రహించి నీయీప్సితము సాధించుకొనుము. మహాత్మా! రాఁబోవు విజయదశమినాఁటికి సర్వసర్వంసహాజైత్రయాత్ర సాగింపుము. మహోపకారి నగు నన్ను మరల నింతవానిఁ జేసిన నాఋణ మప్పటికిఁ గొంత దీర్చుకొందు- నని పలికెను. సభ్యులెల్లఁ గరతాళములతో నతని నభినందించిరి. విదులామహాదేవి వాని నాదరించి- యీతఁడు నా రెండవకొడుకు—కని సభలోఁ బెద్దగాఁ జెప్పెను.

అంతట నా ప్రభంజనుఁడు విధులా భాగ్యవతీ వైదులేయులకు మ్రొక్కి, 'తల్లీ! నాయపరాధము సహింపవలయును. నాఁడరణ్యములోనున్న మీకుత్సాహ మేవిధముననైనఁ గలిగింపవలె నని దానికి నుపాయమేమియుఁ దోఁపక వచ్చి చెఱువునకు నీళ్ళకువచ్చిన భాగ్యవతీదేవితో మున్నొకనాఁడు హేళనగఁ గాఱులు వగికితిని. కార్యసాధనమునకు వ్యంగ్య ప్రధానముగఁ నాడిన దప్పు కాదని మన్నించినను సరే, యమదండనము లేకుండ రాజదండన మనుగ్రహించినను సరే. మీరే ప్రమాణ'మని యప్పటి మాటలు సభ్యులెల్లవినునట్లు చెప్పెను. ఈచరిత్రమున కెల్లరు బిత్తరపోయి, యొకరి మొగము లొకరుచూచుకొనఁ జొచ్చిరి.

అంత విదుల, 'యిది నాయధికారములోనిది కాదు. భాగ్యవతి దయ' యనెను. భాగ్యవతి 'నేను స్వతంత్రను గాను. నానాథున కిష్టమైనభావము దుష్టము కాదు గాన పుత్రప్రేమతో నాదరించి సైరించితి' ననియె. సంజయుఁడు 'వీరమాత, వీరపత్ని యనుకూలించిరిగాన నీయందునిజముగఁ

దప్పున్నను క్షమించితిని. నీకు యమలోక మేనాఁటికినిఁ జూడ నవసరము లే'దనెను. ఆఁతఁడు కృతార్థుఁడ నైతి నని నమస్కరించెను. ఒక్కొక్క విషయము తలఁచుకొని యాశ్చర్యానందముల నొందుచు నెల్లరు నాఁటికి సభఁ జాలించి యథోచితముగ నివాసముల కేగిరి.

అదృష్టము దుర్బలున కైన విజయము నొసఁగును గదా.

[ ఈ కథాభాగమును దయతో నా కొసఁగిన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారికి నా నమస్సులు

ఘ. ల. న. శాస్త్రి ]

# అయుతుఁడు

## ౧

### అయుతుని విద్యాభ్యాసము

పూర్వము పలువురు మహామునులు తమ యాశ్రమ
ములలో విద్యాలయములు స్థాపించి వేనవేలు శిష్యులకు
విద్య గఱపుచుండెడివారు. ఆవిద్యాలయములు నేఁటి మన
విశ్వవిద్యాలయములకన్న నెన్నియో రెట్లు వన్నె కెక్కి
యుండెడివి. అచట ముక్కాకలు దీఱి యారితేరిన శిష్యులను
గురువులు ధర్మప్రచారమునకై నానాదేశములకుఁ బంపెడు
వారు. వారిశిక్షణమున ధర్మమప్రతిహతమై సాగుచుండెడిది.

అట్టి విద్యాలయములను స్థాపించిన మునులు 'కుల
పతులు' అని పిలువఁబడెడివారు. కణ్వుఁడు, దుర్వాసుఁడు,
మున్నగువా రట్టి కులపతులే. వారి యాశ్రమమునఁ బది
వేలకు మించి శిష్యులుండెడివారు.

కులపతు లని పేరు గాంచిన మహామునివరులలో
నగస్త్యుఁడు చెప్పఁకొనఁదగినవాఁడు. అగస్త్యునివిద్యాలయ
మున విద్యఁ గఱచు శిష్యుల సంఖ్యకు మేర లేదు. వారిలోఁ
బ్రయుతుఁ డను మునికుమారులు అయుతుఁడు నియుతుఁడు
ననువా రిరువురు కలశజున కత్యంతప్రీతిపాత్రములై యుండిరి.

అయుత నియుతు లొకతల్లిబిడ్డ లయినందుల నొక్కటియె నియమముగ నగస్త్యుని శుశ్రూషించుచుండిరి. విద్య గఱచు వేళల వా రొకలియు దప్పియు నెన్నడివారు గారు. తలమాసెనని గాని, ఒడలు బడలిన దనిగాని, యాయాసముగ నున్నదనిగాని, రాత్రియనిగాని, పగలనిగాని, కూర్చుండుటలో మాటి మాటికిఁ గదలి కాలు మార్చుకొనుటగాని, యెఱుఁగరు. వా రిగువురిం జూచిన కొలఁది నగస్త్యునకుఁ గుశలవులం జూచిన వాల్మీకిమహామునికటులు మిక్కిలి మక్కువ పొడము చుండెడిది.

క్రమ క్రమముగ వా రన్ని విద్యలు నేర్చి సమావర్తనమునకు సిద్ధముగ నుండిరి. అట్టియెడ నగస్త్యుఁడు వారిపైఁ బ్రేమ మినుమడింప వారలకుఁ దగిన కన్నియల నెందేనిఁ దెచ్చి తన చేతిమీఁదుగఁ బెండ్లిండ్లు చేయ నూహించెను.

అందుల కాతఁ డెల్లమునిపల్లెలు వెదకి వెదకి విసివెను. కాని తగిన కన్నియ లెందును దొరకరైరి. ఇఁక భూలోకమున లాభము లే దని లోపాముద్రాపతి సత్యలోకమునకుఁ బోయెను. అందు శారదాదేవి సరసన యుండఁ, జంద్రరేఖతో మెఱయు బంగారుకొండయో యనఁ దెల్లని రాయంచ చెంగట నిరవొంద, శుక్రగ్రహముతో వెలుఁగు హాటకాద్రినిఁ బోలి; స్వచ్ఛములైన తెల్లనియలంకారములచే నలంకరింపఁబడి యుంట, శారదాభ్రములచే నంటఁబడి యున్న భూరిశైలముతీరునఁ; దెల్లతామరవిరిగద్దియపైఁ గొలువుండి, దిగ్గజములమూఁపులమీఁద నలువారు కాంచ

నాచలముసొంపునఁ; గనువిందులు గొలుపు చతుర్ముఖునిఁ గని యగస్త్యముని పలుతెఱఁగుల నుతించె.

బ్రహ్మయుఁ నగస్త్యునిపొగడ్తల కలరి యిట్లనియె—మునీంద్రా! నీవుమాత్రము సామాన్యుఁడవా? నేను సృజించిన భువనములలో నీకు సరిసమానులు లేరు అనుట సాహసము గానేరదు. లోకములో మఱి హుంకారములు లేవా? అవేమైన నుపేంద్రునిహారము నుత్పాటింప సమర్థములయ్యెనా? బొమముడులు లేవా? అవి యేనాఁడైన వింధ్యపర్వతగర్వస్తంభనమునకుఁ బనికివచ్చెనా? పుక్కిలింతలు లేవా? అవి యెక్కడనేని యెక్కచుక్కయినఁ దక్కక త్రావి, సముద్రము నింకించుపనికిఁ బూనినవా? జాఠరాగ్నులు లేవా? అవి యెల్లతాపసులఁ దనపొట్టఁ బెట్టుకొని జీర్ణించుకొన్న వాతాపిని బ్రమింగి తుకతుక నుడికించి రూపుమాపనోపినవా? కుంభసంభవా! ఇన్ని మహామహిమములు గలిగి లోకరక్షణకై నడుము కట్టి దుష్టనిగ్రహమునకు, శిష్టజనానుగ్రహమునకుఁ గారణములైన రోషభీషణరేఖలతో వెలుగొందు నీవంటి ప్రోడలు లోకమున లేరు, లేరు. లేరు. మిత్రావరుణ కుమారుఁడవై పుట్టుటయే నీవైశిష్ట్యమును జాటుచున్నయది. అగస్త్యా! నేఁడు మాకు సుదినము. నినుఁ జూడఁ గంటిమి· మేలు. నీవచ్చినపని యేదియో, నొడువుము. నాయోపినకొలఁదిఁ దీర్చి యిత్తు.

నా విని యగస్త్యముని మిక్కిలి సంతసించి తన వచ్చినపనిమొగమును విన్నవించుకొనెను, అందులకు నలువ

ముదంపడి, 'మున్ను స్త్రీసృష్టి కెల్లఁ దలమానికములై యుండ వలెనని యిరువురు కన్యకల నాయాత్మ నిర్మించియుంటి. వారు గాయత్త్రి యనియు, సావిత్రియనియుఁ బిలువఁబడు దురు. ఆకన్యకల నిరువురను నీ కిచ్చెద. కొనిపోయి యయుత నియుతులకుఁ బెండ్లి సేయు,' మని యాకన్యారత్నములనిచ్చి పంపెను.

కుంభసంభవుఁడు నొక్కఁగంతునఁ దన యాశ్రమమున కేతెరి, గాయత్త్రి సావిత్రులం జూపి యయుత నియుతులఁ బెండ్లియాడుఁ డనెను. అం దయుతుఁడు, తనకుఁ బెండ్లి చేసికొనునిచ్ఛ లే దనియు, మెడ కట్టి సంసార బంధము నంటఁగట్టకుఁ డనియు, వేఁడుకొని యొల్లఁడయ్యె. అందుల కగస్త్యుఁ డలిగి నియుతున కా కన్నియల నిరువురఁ గూర్చి పెండ్లి చేసి, యయుతునిఁ దనయొండఁ బాసి తొలఁగి పోఁ గఠోరముగ శాసించె.

అయుతుఁడు సేయున దేదియు లేక, దీనాననుఁడై గురువును బాసి హిమవత్పర్వతప్రాంతమునకుఁ బోయెను. అచట నొక చట్రాతిపైఁ గూర్చుండి యాతఁడు తనగతికి వగచి యిటు విచారించె—పరిణయము ప్రణయమూలము. అది యొల్లనివానికిఁ బ్రళయమూలముగదా. సంసారబంధ మునఁ దగులువడినవాఁడు వెండి వెలిఁబడుట కలలోనివార్త. వానియథఃపతనమునకు మేరయు లేదు. అందుల కనియేగదా నేను పెండ్లి యన నొల్లనిది? ఇంతమాత్రమునకే గురుఁ డింత కఠినముగ శాసింపవలెనా!

యువతి నొల్లనుగాని, నాగురుఁడు కొండపై నెక్కు దూఁకు మన్న దూఁకనా? వాలుగంటి చూపులకు గుఱి గాను గాని, వాఁడికత్తులపై నిలు వెల్ల వ్రాలు మన్న వ్రాలనా? అంగన నొకతెఁ గన్నెత్తి చూడనుగాని, మున్నీటి నీటిలో సుడివడి మునుఁగు మన్న మునుఁగనా? జవరాలి నొకతెఁ జెట్టఁబట్టనుగాని, కాలసర్పమున కర్పణముఁ గ మ్మనినఁ గానా? ఈ నా కాయకర్మములు తనకు సమర్పితములు కావా? తా నేమి చెప్పి పనిచిన నది తప్పక చేయనా? వద్దు మొఱ్ఱో యను నాకుఁ బెండ్లి సేయ నాగురుఁ డేల హఠమూనవలె?

నిజముగా నియుతుఁ డట్టిపనికిఁ దగినఁ దగుఁగాక, గృహిణి యని పరిగ్రహించి గంపెఁడు గృహబంధము తలపై వేసికొనుటకన్న వేఱె కీడు గలదా? అది గురుహితమే యగుఁగాక, నేనుమాత్ర మట్టియురిలోఁ దవులుకొనఁ జాల. ఇచట నిలిచి గట్టి బ్రహ్మచర్యవ్రత మూని తపించి దేహ బంధమును బాసెద.

## ౨

## అయుతుని తపశ్చర్య

అని నిశ్చయించి యయుతుఁ డనువవు నొకచోట నాశ్రమము నిర్మించుకొని యుగ్రతపము సేయఁ దొడఁగెను. నానాఁటి కాతని నిష్ఠ దృఢమై తత్తపోగ్నినుండి పుట్టిన

దావానలజ్వాల లోకసమును గ్రమ్మఁ జొచ్చెను. మేఘములు లేకయే మింటినుండి గనగన మని నిప్పుకలు గురియ సాగె. సముద్రము లల్లకల్లోలములై ఘూర్ణిల్లఁ దొడరె.

ఆ కాఁక నాకపురి నలుమూలలకు నెగఁ బ్రాకెను. అంత నింద్రుఁడు, నిప్పు ద్రొక్కినటులు, తలపైఁ దేలు గుట్టి నటులు, పుక్కిలింతలుగ నావఁ ద్రావినటులు, నయి, యయుత బ్రహ్మచారి తపమునకుఁ దపించి, యది నేలపాలు సేసి వత్తు నని యూని, యొక ముదుసలిబ్రాహ్మణ మునివేషమున నయు తునితపోవనమున కేతెరె. ఆ కపటబ్రాహ్మణునివెంటఁ బలు వురు శిష్యులును వచ్చిరి. వారిలో నొకఁడు, ప్రాఁతజింక తోలుచేఁ జుట్టబడిన శాస్త్రగ్రంథములపెట్టెలు మోసి కొనుచు వచ్చె. వేఱొకఁడు కంబళము, బ్రుసి, కమండ లువు, మున్నైనవానింబూనె. ఇంకొకశిష్యుఁడు, యవలు, పిండి, బియ్యము, ఉప్పు, చింతపండు, మొదలైన వంట సామగ్రిని మోచికొనుచు వచ్చె. మఱొకఁడు, సమిధలు, నేయి మున్నగునవి పోసి నింపిన వెదురుసోలలు, స్రుక్కులు, స్రువములు తలపై నిడుకొని రొజుచువచ్చె. ఇంకొకఛాత్రుఁడు, మెడపలుపు చేతఁ బట్టుకొని దూడను ద్రోలుచు నడువలేక కడు నలసి తడఁబడుచున్న యొక ముసలియావును బిగ్గ నద లించి నడుపుచు నేతేరె. మఱియు నాకపటి సరసనఁ దెల్లగా నెరసిన జుత్తుతోడి తల యూఁడిపోవునట్లు వడఁకుచు నుండ నాతనిగృహమేధిని కఱ్ఱ యూఁతవైచుకొనుచు వచ్చె.

ఇట్లు సపరివారముగా నరుదెంచి యాకుహనా భూసురుఁ డయుతునియాశ్రమముముంగిటి పందిట విడిసి, చేరువ నొక చెట్టున కాపును గట్టివేసి శిష్యులతోఁ గొలువు దీర్చెను. అప్పటికి మధ్యాహ్న మగుటచేత మాధ్యాహ్నిక క్రియలు దీర్చుకొని, వండి, కుడిచి, యావునకు మేఁత వైచి, యొకకొంతతడ వచట విశ్రమించి, యెండ దిగిఁగి ప్రొద్దు పడమట వ్రాలిన వెనుక లేచి, యామాయావి శిష్యసహిత ముగాఁ బరిసరము నవలోకింపుచుఁ బచారులు సేయు చుండెను.

అంత సాయంతన మగుటచేత సమాధి చాలించి, నదికి సంధ్యావందనార్థము చన నయుతుఁ డుంకించుచుండెను. ఆసమయము నరసి యాదొంగ బాపఁ డయుతుని పాలికిం బోయెను. ఆ బ్రహ్మచారియు వానిం గని యతిథిపూజలు సేసి, తగు నాసనమునఁ గూరుచుండఁబెట్టి, అయ్యా! తమ వచ్చినపని యేదియొ సెలవిం డని వేఁడెను. అంత నాకృత్రిమ ముని యిట్లనియె.

ఓయీ! నాయాశ్రమము పసిఁడికొండపై నున్నయది. అచట నాఁకలిదప్పులు లేవు. కామము, క్రోధము, లోభము మున్నగువాని కచట నిలువ నీడ లేదు. అచట స్వచ్ఛము లైన నీళ్ళు గల కొలఁకు లెన్నియో గలవు. ఆప్రాంత మంతయు ప్రశాంతమై యతిశయిల్లు. పారిజాతాదితరురాజముల కది యునికిపట్టు.

అందుఁ గాఁపుర మున్నవా రెల్లరు శ్రీసఖులు, సుగుణగణభూషితులు, సర్వసములు. వా రెల్లరు నను గురువుగాఁ దలఁచి కొలుచుచుండ నేను నాయింతితో నచటఁ గాఁపుర ముందు. అఖిలధర్మములందు గార్హస్థ్యము మిన్నగావున, నాధర్మమునఁ బాయక నిలిచి యుంటి. ప్రకృతమునఁ దీర్థయాత్రలు సేయవలయు నని కుతూహలము గలిగి బయలు దేరితిని. కంచి, శేషాద్రి, శ్రీరంగము, ప్రయాగ, గయ, భద్రగిరి, సింహాచలము, అది యిది యన నేల? నాలుగు దిక్కులఁ గల తీర్థము లన్నియు సేవించి వచ్చుచుఁ, బాండురంగవిట్ఠలప్రభువు మహిమాతిశయము విని యీ దేవదేవుని సేవింపఁ బోవుచు- నీదారి నిచటి కేతేగితి.

అది యటు లుండె. నీ వెవ్వఁడవు? జందెము, తేజము నీబ్రహ్మచర్యమును జెప్పకయె చెప్పుచున్నయవి. నూనూగు మీస లిపుడిపుడ మొలక లెత్తుచున్నవి. ఇంత చిన్నిప్రాయమున నీతప మేమి? ఈవ్రత మేమి? ఎది పొంద నభిలషించితివి? ఇట్టి ఘోరనియమమున సుకుమారమైన శరీరము నెండింపఁ జేయుటకు దూరాలోచనము లేని నీహృదయమే కాక వేఱొండు కారణము లే దని నుడువుటకు నానాలుక పొక్కుచున్నయది. ఉన్నదియున్నట్లు నొడువుము. విందము.

అన విని వినయమున నయుతుఁ డగ స్త్యమునియొద్దఁ దనవిద్యాభ్యాసము మొదలుగ నది తుదగాఁ గల కథ యంతయుఁ బూస గ్రుచ్చినట్లు తూ చా తప్పక చెప్పి వెండియు నిట్లనియె— మాన్యా! సలసలమను కలశజనియలుక

యను నెసరునీటఁ గలవడి తల యంటి చూచుకొని యిటు లిచటికి వచ్చి తపోనియతిఁ గొంటి. విషతుల్యము లైన విషయాభిలాషముల కిపుడు ననుఁ దఱియ గుండెలు చాలవు. ఇంక ననతికాలమున నీతపము సాధనముగ మోక్షముఁ బడయ నున్నాఁడ.

నావుడు నవ్వుచు నామాయలమారి పాఱుఁ డనియె—

ఓయీ! నీబాలభావ మింకను బోకున్నయది. చాలుఁ జాలు. అగస్త్యునకు శిష్యుఁడ నని చెప్పి గురువునకుఁగూడ నపకీర్తిఁ దేకుము. ప్రపంచమును గుర్తింపని నీతపమా మోక్షమును సంపాదించి యిచ్చునది?

ప్రయుతుఁడు నాప్రాణసఖుఁడు. ఆతని ప్రాభవము. భవము. గుణగణములవైభవము, నా కెఱుక. అతనిజ్యేష్ఠ పుత్త్రుఁడ వని విని మొట్టమొదట నాతనిఁ జూచినయట్ల కాఁ దలఁచి యెంతయో సంతసించితి. కాని తుదదాఁక విన నీవిరుద్ధచరిత్ర మంతయు నా చెవుల సూదివలెఁ జిల్లులు వైచుచున్నది.

కులధర్మమును బాటింపక, చదువు చెప్పిన గురువును ధిక్కరించి, శాప మొంది, తోఁబుట్టులఁ, జుట్టపక్కముల, నెల్లరఁ బాసి, యీ కాని మాఱుమూల నట్టడవిలో నేకాకివై యుట్టి గట్టుకొని వ్రేలాడఁ జూచుచున్నావు. మేలు. ఇఁక సంసారపిశాచము నీదరికి రాదుగాఁబోలు. స్మరాగ్ని సోకకుండ జ్ఞానామృతప్రవాహమును నిలిపికాపాడ నీకె గాదు, మహామహుల కేనియు నలవి గానిదిసుమా.

నిశ్చలమనస్కులై మహామును లని పేరు గన్న పరాశరాదుల ఱాయివంటి హృదయమునుగూడఁ గఱగించి జలజల ప్రవహింపఁ జేసిన దిట్టసుమా మన్మథుఁ డన. అతనికిఁ జేతకానిది లేదు. తపములు జపములు నాతనియను గ్రహము ప్రసరించినమీఁదనే పొసఁగఁగలవు. అది నిశ్చ యము. మణిమయాలంకారములు ధరించి, లలితములైనఁ యాగారములందు విహారములు సేయుచు, శీలసంపద నెన లేని విలాసినులచే లాలింపఁబడి, మధుర మధురమైన కలమాన్నముం దిని, సుగంధవస్తువులు మేన నలందుకొని, రూపసంపదలో మన్మథున కీడుజోడులైన జనకాదులును నట్టి మహానందము ననుభవించిన వారేసుమా. నీమొగముననే ప్రొద్దు పొడిచి యింతటి వైరాగ్యము నీవలననే పుట్టలేదు.

అంతియగాక, ఒరులకుఁ బుక్కిటిపురాణములు రాత్రింబగళ్ళు విప్పి చెప్పఁగలరుగాని, తీవ్రమైన వ్రతములు, ఆచారములు పూని తలలు గొఱిగించుకొన్న సన్యాసులు సైతము తమవిషయము వచ్చిన నుపచారములను దిని వాని చవులు వెతకుచునుందురు. సారస్వతపట్టభద్రులై పేరు గాంచిన కవిపుంగవు లెందఱో సుందరీవిభ్రమాంభోధిని దమ నేర్చినకొలంది వర్ణించి వర్ణించి దరి గానక యందు మునిఁగి పోయిరి. అయుతా! నీ వేమి వారితలలోనుండి వెడలితివా? విరసమైన యంతఃకరణమున స్త్రీసాంగత్యము సరిపడని దని యేమేము యుపన్యసించుచున్నావు! చాలుఁ జాలు.

బుడుతఁడా! మఱొక్కమాట. పైరుపచ్చలు చక్కగాఁ బెరిగి, కోటికొల్లలు పండి, ధాన్యరాసులనుండి తమపాలు బండ్లపైఁ బాలేరు లింటికిఁ దోలుకొని రాఁగా, వడుగులు, పెండ్లిండ్లు, సమర్తలు, శోభనములు, మున్నగు వానితో నిల్లు నిత్యకళ్యాణము పచ్చతోరణముగఁ గన్నువిందులు సేయ; యాచింప వచ్చిన యర్థు లభీష్టార్థములఁ బడసి పొగడుచుండఁ; బరిచారికాకోటు లడుగు దాఁటక తమపని పాటులు లెస్స పాటించుచుండ; వచ్చుచుట్టపక్కములసందడి నెట్టుకొనఁ; దన పెద్దతనమున గ్రామమంతయు వన్నెకు రాఁగాఁ; దగవు వచ్చినపట్ల నూరివారు తీరుపునకై తన్ను సాక్షిగాఁ గోరుకొని ధర్మపద్ధతి నెఱప; నిర్నిద్రమైన బుద్ధి వైభవమున నిత్యనైమిత్తికములు దీర్చుచు; హరికి నివేదింపఁ మిగిలినప్రసాదము నిల్లాలు పరమాదరమున వడ్డింప నారగింపుచు, సుఖముండు గృహమేధిసుఖస క్తి ము క్తిగాని, యది నిదురవంటిదియుఁ జట్రాతివంటిదియుఁ గాదు.

ఆపలుకులు తనచెవులకు ములుకులవలె సోఁక ప్రయుతునిసుతుఁ డయుత్యుఁడు మునుపటికన్న నెక్కుడుగ బిగిసి యిట్లనియె.

మహాత్మా! మీాయనిన దంతయు వింతగా నున్నది. ముసలితనము పైఁబడి కాటికిఁ గాళ్ళు చాచుకొని యుండి, ముక్తికాములై మనవలసిన మీావంటివారేనా యిట్టిపలుకులు పలుకవలసినది? కామాంధకారమునఁ గనుగానక వనితా బంధమునఁ దవులువడు లోకమునకుఁ ద్రోవఁ జూపవలెఁ

గాని, మఱియుఁ గటికిచీఁకటికో నేటఁ గూలఁ ద్రోతురే? నిష్కారణముగఁ దన్నుఁ బదరి యగస్త్య మహాముని బహిష్కారము సేయ నింతదూర మేతేరి తపమున శరీరమును శుష్కింపఁ జేసికొనుచున్న నన్ను ముష్కరుఁ డని యెంచితిరి కాఁబోలు. దేవరవా రిట్టి చదువులు విప్పి కనుఁ గప్పఁ జూచుచున్నారు,

అయ్యా! మమకారము లేనివానికి, బంధువు లని, మిత్రము లనియన్నదమ్ము లని, విచార మెచటనుండి వచ్చును? అట్టియెడ వానికి వారితోడి తవులాటమున కసలె వలనుపడదుగదా! గాఢమైన విజ్ఞానముతో నిగూఢమైన యంతఃకరణము గల నిర్మమునిధైర్యమును మన్మథుఁడు గాదు, వానియయ్య యైనను గదలింప నేరఁడు. మదధారలతో నిండియున్న యడవియేనుఁగుకుంభస్థలములోని ముత్తెములను గొన సాధ్యమా? వృద్ధుఁడా! మునిజనులపాలిటి మహాభాగ్యమైన మోక్షమును బడయ నేరక, నీవీ బూడిద బొట్టుఁ బోలిన తుచ్ఛ గృహస్థధర్మమును బొగడుచుంటివి గాని వేఱొండు గాదు. ఎన్నఁడేనిఁ జిమ్మటపురుగు సింగమగునా? గాజు రత్నమా? అల్పమైన కనకశలాటుక కల్పఫలము కా నోపునే?

అంతియగాక మహాత్మా! నీ వను గృహస్థధర్మములు సంపద లెస్స యున్నఁగాని కొనసాగ నేరవుగదా. ఆసంపద పూర్వజన్మసుకృతమునఁగాని చేర దనుట నిర్వివాదము. అట్టిసంపద చేరెనో, యెట్టి మహాత్ముమైనను నిముస

మున స్మరునికిల్లాకుబంటుఁ జేసివైచు. కావున, నన్నీ యవినయ మార్గమున కీడ్చి యేల చంపెదవు? దివ్యబోధమును దయ సేసి యుద్ధరింపుము.

లోకు లిట్టిపట్టులఁ జరాశరాదులను బోలికగాఁ బెట్టుకొని గృహస్థధర్మములు గృహస్థధర్మములు అని యుపన్యసించి చరింతురుగాని, పెండ్లి పేరంటములు లేకయే సంన్యాసియై పరమవిజ్ఞానఖనియై చిఱుతతనమునందె సర్వభూతమయత్వము గడించి బ్రహ్మసముఁడైన శ్రీశుకునిఁ గొని యెందులకుఁ గొనియాడరో తోఁచకున్నది. లోకము అంధప్రాయ మన నింతకన్న వేఱె తార్కాణ గావలెనా?

మునీంద్రా! ఏమైన నగుఁగాక. కులగోత్రములు గాని, స్త్రీలుగాని, యిల్లు వాఁకిలి గాని, రూక రుద్ర గాని, పొలము పాత్రగాని, నాకేమియు నక్కర లేదు. అవన్నియుఁ గత్తెరబోనులు.

అని తనయుక్తికిఁ బైయుక్తి పన్ని పలుకునయుతుని పలుకుల కులికి ముసలిముని చుఱచుఱఁ జూచుచు వానితో మరల నిట్లనియె.

ఓయీ! నీ వేమియు ధ్రువుఁడవు గావు. నారదు నంతటివాని యుపదేశము నీ కబ్బలేదు. వలయు నని చెడిపోయెద నని కూర్చున్నవాని నడ్డగించి సరిదిద్దఁగలవా రెవ్వరు లేరు. నాయుపదేశించుబుద్ధి నీయందు నాటక, పందకుఁ బోటు, లోభివానికి నీఁగి, బోయవానికి దయ, నపుంస

కున కంగనాసుఖము, నెఱింగించు తెఱంగయ్యె. ఎట్టులైనఁ గమ్ము. ఇది మంచి, ఇది చెడ్డ యని యల్పునకెఱిఁగించువా రెవరు? ఎఱింగించినను నతఁడు మరలునా? పల్లమునకు వడి వడిఁ బాఱు నీటి నడ్డగించి, సమప్రదేశమునకుఁ బంప సాధ్యమా? అగస్త్య నదిరించినవానికి నాయుపదేశములు లెక్కా? గుడి నువ్వెత్తుగ మ్రింగువానికిఁ దలుపు లప్పడములు గావా?

వ్యాసుతాదులను బోలికగాఁ గొని వాసికై మంగలి కత్తి మ్రింగఁ జూచుచున్నావు. అందనిపంటి కాసవడి యట్టుఁ జూచుచున్నావు. మఱియు బొందితోన కైలాసమున కేఁగ మూట సర్దుకొనుచున్నావు. ఇవన్నియు నీ కలవిగాని వియుఁ జేడ్పాటునకు మూలకందములును సుమా. యోచించుకొనుము. నామాట వినుము.

అని యెంత బోధించినను వినమి నయుతునిపై విసివి యాకపటబ్రాహ్మణుఁడు, పోనిమ్ము. నీగతికి నీవే పొమ్మని, వానిం బాసి పరివారముతోఁ దొలఁగిపోయె. తనపని నెర వేరమి నట్లు పోవుచు నావేసమున నున్న యింద్రుఁడు, కామ ధేనువువలన నది సమకూరవలె నని, యూహించి, తన తలఁపును దేవమాయచే దాని కెఱింగించి యాయావు నచ్చటన యాచెట్టునకు వ్రేలాడఁగట్టి యుంచి చనియె.

## 3

### అయుతుఁ డావును బోషించుట

ముసలిముని చనిన వెనుక నయుతుఁ డతని పలుకులకుఁ గలఁగుచు నేవగింపున దిక్కులు కలయఁజూచుచు నుండ, నెదుట నొకయర్జునవృక్షమునకుఁ గట్టివేయఁబడిన ముసలియావొకటి యాతనికంటఁ బడెను. అప్పు డది యప్పుడో మఱొక క్షణముననో చచ్చునటు లుండెను. తోలు, సందుసందుల డొల్లవడినయెముకలు దప్ప దాని మేన మఱొకటి యున్నట్లు తోఁచుటలేదు. కన్నులు పీఁతకలుఁగులవలె లోఁతై పుసులు గాఱుచుండెను. కాళ్ళు పుల్లలవలె నిలువలేక వడఁకిపోవుచుండెను. కొమ్ములబరువునఁ దల యూఁగి దించుకొనిపోవుచుండెను. పుండ్లు పడునట్లు కుట్టి, యున్న కొద్దిచీము నెత్తురు పీల్చుచున్న దోమలను ఈగలను దోలుకొనుటకైనఁ బనికి రాక దానితోఁక వెనుకబరువునకు మాత్రమే పనుపడి వ్రేలాడుచుండెను. చెవుల బిలముల లోనికిఁ గందిరీఁగలు పోవుచున్నవో, మఱేమవుచున్నవో అది గుఱుతించు నంతలో లేదు. పై పెచ్చు నేలకు దించుకొని పోవు కుండపొదుగులో మూతి పెట్టి దూడ పాలకోసమై క్రుమ్ము నొక్కొక క్రుమ్మునకుఁ దూలి నిలువలేక పడఁబడఁ బాఱుచు గడగడ వడఁకుచు నాయావు చావునకు సిద్ధమై యుండెను.

అదిగని యయుతుఁడు దయ పొడమి, యిది మొన్నటి మునిది కానోవు. పోవునపుడు నామీఁదియలుకచే మఱచియో,

యిట్టి దుర్గతి నుంటచే రోసియో విడిచి పోయినాఁడు కాఁబోలునని యనుకొనుచుఁ దఱియ నరిగి యాగోమాత నెట్లైన గాపాడవలయునని నిశ్చయించుకొనెను.

నాఁటఁగోలెఁ గాళ్ళకొంకు వోవ మాలీసు చేసియు, నోడలు మెల్ల మెల్లగఁ దోమి కడిగియు, గోళ్ళతో గ్రుచ్చుకొనకుండ రోమములు దువ్వి సరిచేసియు, నెత్తురుఁ జిలుకు పుండ్ల కాకులు నలములు వేసి పసరులుపూసి నయముచేసియు, వేళకుఁ దగిన లేఁతపచ్చికఁదెచ్చి మేఁతవైచియు, నమలుడు పడక పంటిసందుల మిగిలిన గడ్డిపరకలుదీసి పాఱవైచియుఁ, జల్లని కుడితినీరు ద్రావఁబోసియు, నింటిముంగిటి పందిటికంబమునఁ గట్టివైచి నిముసమేనియుఁ బాయక గారామున నాతఁ డాయావును సాఁకఁదొడఁగె.

అదియు నయుతునిపైనఁ దనప్రాణములు నిలుపుకొని యున్నట్లు జాలిచూపులు చూచుచుఁ గ్రమక్రమమున బలిసి చియ్యఁబట్టసాగె.

ఆయావుపేడ, యుచ్చ, యెత్తి బాగుచేయుటతో నయుతునియాసనాభ్యాసముల నేర్పు పట్టుదప్పిపోయె. లేలేఁత పచ్చిక కోసికొని తెచ్చి పెట్టుటతో దర్భలు గోసికొనివచ్చు నలవాటు మాటువడియె. జాఱిపోకుండఁ గడు జాగరూకతతో మెడపలుపుముడి బిగించి కట్టియుంచుటతో జపమాలఁ ద్రిప్పుచొప్పులు దప్పిపోయె. ఆయావుపై వ్రాలి ముక్కులతోఁ బొడిచి మూఁపునఁ జెవులలోఁ, దోఁకపైన, నందందు గాయపఱచు కాకులఁ దోలుపనితో మంత్రములఁ

జమువృపని వెనుకఁబట్టె. అగస్త్యునొద్ద విద్య నభ్యసించి పెండ్లి యొల్లక, ఆసలన్నియు మొదలంటఁ గోసికొని యున్న యా గోచిపాతరాయని కటువంటి కడవరాని గొడవ మెడఁ జుట్టుకొనియె. చిత్రము! విచారింపక తమకుఁ గానిపను లలోఁ జేయిడువారి కెచటనైన సుఖము గలదా!

బక్కచిక్కిన యా మాయయావు సయిత మాతని సాఁకతమునఁ గ్రమక్రమమునఁ దిండి యొంటఁ బట్టి బలిసి చియ్యఁబట్టి క్రొవ్వి బీద బలిసి బందికాఁ డయినచందమునఁ బోఁతరించి యయ్యడవిలో నెదురు లేక తిరుగఁజొచ్చె. కను మూసి విప్పునంతలో. గుండువలె బలీయమై పెరిగిన తన దూడతో నెగిరి చెంగున నారఁబండిన యితరమునులపొల ములలోఁ బడి దుంపశుద్ధిగాఁ దిన నలవాటుపడెను. మేఁత బలువున నది తిరుగఁ జాలు మోచియునికి వదలించుటకుఁ గొట్టుటకు మన సొల్లక చేతులు రాక యితరుల కాలు కూఁతలకు బదులు వలుకలేక అయుతుఁడు చిక్కువడు చుండెను. అదియు నంతకంతకుఁ బోఁతరించి రోజుకు నూఱు జగడములు కొనివచ్చి యయుతునిపర్ణశాల పీకించుచుండెను. అందుల కయుతుఁడు కొందల మందుచు నిట్లని తలపోసె.

అక్కటా! నాకీ యా వెక్కడ దాఁపురించినది? ఆవుతోలు గప్పుకొనియున్న బెబ్బులిగాని యిది నిక్కపు టావు గాదు. కాకున్న దేవమాయ కావలె. లోకము లోని యావుల కిట్టి లక్షణము లున్నవె? దీనితోఁక దండము వలె బండబాఱి యున్నది. దీని యీ కుండపొదుగు బడబడ

వడగండ్లతోటి వర్షమునటులు పాలకాలువఁ బాఱించు చున్నది. దీనిముకుగోళ్లు నేలబారియులు. దీనిమెడ, దాడఁ కొలఁతల కందక యున్నవి. ఇందువలననే గాఁబోలు ఆముసలిమునియు రోసి యాతీరునకుఁ దెచ్చినాఁడు. ఇపుడో పోఁతరించిన దీనిపై గాలి నీవారధాన్యపుచేలకు వత్సనాభి గాలి యైనది. ఇనుపగుండ్లఁ బోలిన దీనిడెక్కలు కంద మూలములకుఁ గఱికుద్దాలము లైనవి. ఇద్దానికఱకునాలుక బర్హిస్సులకుఁ జటులదవానలచ్ఛట యైనది. ఇద్దాని కంఠ ధ్వనులు చూలు మోసిన లేళ్లకు వినరాని యారణోచ్చార ణము లైనవి. నాకు మొగమోడిగదా, యింతదనుక నోపిక పట్టి తోడిమును లీయాగడమును సెచి యిద్దానిపనిఁ బట్టక మానిరి? ఇంక నిది యిచటనున్న నాకును మాటదక్కదు.

అని దీర్ఘముగ విచారించి యయుతుఁడు కినుకఁ దెచ్చుకొని, బిగ్గఱగ నఱచుచున్న దూడను లంకెవైచి కట్టి, యావుమెడలో నొక పెద్ద గుదిబండ వ్రేలాడఁగట్టి, తల త్రాఁడు తనచేతఁ బట్టుకొని పొలిమేర వెడలఁ దోలఁ దోలు కొనిపోయె.

అదియు నయుతునియడపులు లెక్కసేయక యెగిరి దుముకుచు వానినిఁగూడ బిరబిర నీడ్చుకొనుచుఁ బోయి పోయి, వాధూలముని తపము సేయుచున్న వనములోనికిఁ బాఱెను. వాధూలుఁ డపరదుర్వాసుఁడు. ఆతఁ డచట మహోగ్రమైన తపమున మునిఁగి యుండెను. వాని చుట్టును పుట్టలు పెరిగిపోయెను. వాధూలుని యుద్దతికి వెడచి, పులి

యున్న పొదను బోలె, మొసలికి నెలవైన మడుగునుబోలె, త్రాచుపామున్న పుట్టనుబోలె, వానివనమును వాసవాదు లేనియుఁ జొర నుంకింపరు. అందువలన నది మహాభయంకరమై దట్టమై యుండెను.

మాయలమారి గోవావు నది యట్లావనమునఁ బడి యాఁగ కాగడము చేసి చేసి యయుతుని చేత్రాఁడు వద లించుకొని పోయి వాధూలముని యున్న వల్మీకమును గొమ్ములతోఁ గ్రుమ్మి చదను చేసెను.

కార్చిచ్చుమంటలతలలువోలెఁ బైనావరించిన గడ్డి తీఁగలు పొడవైన గడ్డములు మీసములు తలవెండ్రుకలు మెఱయు గుహలంబోలి యెఱ్ఱని లోచనగోళములతోఁ బెద్ద కొండవోలె వాధూలుఁడా గోల కొడలు దెలిసి వల్మీకము నుండి వెలువడెను. అయుతుఁడు గగ్గోలువడి వడవడ వడఁకుచు వాధూలునిఁ గని నివ్వెఱపాటున నట నిలువఁబడి పోయెను.

వానిం గని వాధూలముని పదరుచు— ఓరీ దురాత్మ కుఁడా! ఏకాంతమునఁ దపము చేసికొనుచున్న మునుల మీఁదనా నీయాటలు? నీపొగరడఁగింతు. ఏదియు నెఱుఁగక ప్రపంచదృష్టి దొఱఁగి యున్న నన్నిట్లు చేసితివి గావున నీ వొక కప్పవై కుములు— మని శపించె.

అది విని యయుతుఁడు వగచుచు వాధూలునడుగులపైఁ బడి— స్వామీ! ఇందు నా దోష మేమియు లేదు.

పోఁతరించిన యీయావు నూరువెడలఁ దోలఁ దోలుకొని వచ్చుచుండ, నిమ్మొద వెట్టిదియో కాని, యింత కొడిగట్టి మీకు మహాపరాధము సేసె. మన్నించి శాపాంతము దయ చేసి నన్నుబ్రోవుఁడని వేఁడుకొనెను.

వాధూలుఁడు వానిసత్యవచనములకు శాంతుఁడై యయుతునితో ననియె— ఓయీ! నీ తెఱఁగంతయు నెఱిఁగి కొంటిని. ఇందు నీదోసఁగు లేమి నిక్కువము. కాని దైవ మెవరికిని దప్పదుగదా! వగవకుము. అనుభవము కర్మ గతులు నశించుటకు మూల మనుట నిక్కము. ఇది నీమేలు కొఱకె కాఁగలదు. శ్రీనరసింహస్వామి పదము లేమ రక కొలుచుచుండుము. ఆభగవానునియనుగ్రహమున ధన్యుఁ డవు కాఁగలవు.

మఱియు నయుతా! చేయివట్టిన యిల్లాలిమెఱుఁగుల మొల్లముల కేది కాఱుమ బ్బనఁ జెల్లునో, క్రొత్తముత్తియ ములఁ బోలు కొమరులయుదయమున కేది మున్నీ రనఁ జెన్ను మీఱునో, ఆఁకట నకనకఁబడి వచ్చు నతిథుల కేది నిలువ నీడయై నీడఁబ్రామఁ కన నతిశయిల్లునో, దివి కెక్కఁ బ్రాఁకు పితృదేవతల కెద్ది యాధారమో, అట్టి పరమపవిత్ర మైన గృహమేధిధర్మమును గురునాజ్ఞయుని యైనఁ జూడక తెగడి యొల్లకుంటివిగాన నీకిట్టి గొడవ సంభవించె. నీశాప మోక్షమున కదియ యవధిగఁ దోఁచుచున్నయది. నీ వీ కప్పరూపునన కొన్ని నాళ్ళుండి పిల్లజెల్లలం గని పితౄణము దీఱి వెనువెంటనఁ దొంటిరూపుఁ బడయఁగలవు. కప్పపుట్టు

వునఁగూడ నీకు వెనుకటి స్మృతి పాసిపోక నిలుచు. అద్దాన విడువక దేవదేవు నారాధించి ముక్తుఁడవయ్యెదవు లెమ్ము. అని యనుగ్రహించి వాధూలుఁ డయుతుఁడు చూచుచునుండ సూర్యమండలము భేదించికొని పోయి బ్రహ్మసాయుజ్యముఁ బడసె.

అప్పుడప్పుడ యా దొంగ కామధేనువు సయితము దనయేలిక పని దేఱిచి యయుతుఁడు చూచుచుండ దూడతో సురపురి కరిగె.

౪

## అయుతుఁడు కప్ప యగుట

అయుతుఁడు కాలకర్మవశమునఁ దనకు సంప్రాప్తించిన శాపవ్యసనమునకుఁ గుందుచు వాధూలుఁ డనుగ్రహించిన శాపాంతమునకుఁ గొంత యూరడిలుచు నటనుండి నరసింహ దేవుని పాలికిం బయనమయ్యెను. త్రోవలో భీమరథీనదియొడ్డున నున్న పాండురంగ విట్ఠల ప్రభువు మున్నైన దేవతామూర్తుల దర్శించిసేవించుచు నతఁడు నటఁ గొన్ని దినములు నిలిచె.

వెండియు నవ్వటు వటనుండి వెడలి యుత్తరదిక్కుగ నడచి చని చని శ్రీ నృసింహస్వామి వేంచేసియున్న పుణ్యపదముఁ జేరె.

ఆ దేవదేవుం గాంచినంతనె మే నెల్లఁ బులకలు దొడిగి యయుతునకు శాప మెడలినట్లు తోఁచె. ఆస్వామి యడుగులచెంగటఁ జాగిలఁ బడి మ్రొక్కి లేచి యాయుతుఁ డనేకవిధనుతుల నుతించుచుండెను. అంతలో నాతనివివేకము, శమము, దమము, వేదపారాయణనిష్ఠ, భక్తి, వినయము మున్నగున వన్నియు నేమూలకొ దిగెనో, చిత్రముగ నాతఁ డొక కప్పతీరున నయ్యె. ముత్యములు, పగడములు నొకచోఁ గూడినయట్లావింతకప్పయొడలు వింతవింత రంగులతో మెఱయ సాగె.

అనుదినము ప్రొద్దు పొడువకమున్న, సంగమతీర్థమున కేగి యందు బుటుకున మునుఁగు. అచట నిసుకతిన్నెలపైఁ గూరుచుండి మునులు వల్లెవెట్టు వేదఘోషణము నాపోవక ప్రొద్దెక్కుదాఁక వినుచుండును. మధ్యాహ్నవేళలయందు, దేవునిముంగలి బలిపీఠముపై మిగిలిన మెతుకులను మితముగ నరహరిప్రసాదముగఁ దిని తృప్తి పడును. సందెప్రొద్దు మొదలు సగమురాత్రి గడచువఱకును నరహరిమూర్తి కెదురుగఁ గొలుచుచు నిలుచును. అంత శ్రీనరహరి యాదిశేషునిపై లక్ష్మితో మేను వ్రాల్ప నాతనియడుగుదామర విరులసరస నున్న కలుఁగులో సద్దు సేయక యణఁగి జాగరము సేయుచుండు. ఇటులా శాలగ్రామచక్రవర్తి పూర్వజన్మస్మృతి గలిగియుండుటఁ జేసి పాయక నరహరిసేవఁ జేయుచు రోజులు గడపుచుండె. వింతవింతరంగులతో నద్దానియొడలు మెఱయుచుండుటవలన నది యెచటఁ గూరుచున్నను దోలక చూప

రులు వింతవింతగఁ జూచుచు నూరకొనెడివారు. మఱికొంద ఱద్దానిపోకడలుచూచి యిది హరిదాసు, నరసింహస్వామికిఁ గూర్చినబంటు, అని పేర్లిడి పిలిచి లాలించుచుండెడివారు.

ఇట్లు కొన్ని యేండ్లు గడచినవెనుక నొకనాఁడు కన్యాకుబ్జ మేలురాజుకూఁతురు, చెలులతోఁ బౌండరీకపర్వమున స్వామిఁ గొలువ నేతేరె. వా రందఱును నారసింహతీర్థము దరిని, భీమనదిచెంగట, విడిదలచేసిరి. అంత దూర దేశ ప్రయాణమున నలసియున్నకతనఁ గాన్యకుబ్జకన్య జలకమాడ నుత్సహించి చెలికత్తెలం గలుపుకొని నారసింహతీర్థమునకుఁ బోయెను. అందు నీరంబు లాడి వారు వివిధగంధమాల్యాం బరాలంకృతలై, వనసౌందర్యమున కలరుచు మహాబోధి వృక్షముల నీడల నాడుచుఁ బాడుచుఁ బూవుఁదీవల నుయ్యాల లూగుచుఁ దిరుగుచుండిరి.

అయ్యవసరమున నరహరియడుగులదరిబొరియనుండి నిర్గమించు నావింతవింతరంగుల కప్ప యయ్యెప్పులకుప్పల కంటఁ బడెను. దానిఁగని వారును బరమాశ్చర్యమున మునుఁ గుచు నుల్లాసమున బట్టుకొనఁ బ్రయత్నించిరి. కాని యది యెవ్వరికిని దొరకక పెద్ద పెద్ద దాఁటులు వైచుచుఁ జిత్ర చిత్ర గతులఁ దిరుగ సాగెను. అంతఁ గాన్యకుబ్జరాజకన్య మీఁదిటఁ దొలఁగి నిలిచి చూచుచుండుఁడు, నేఁబట్టుకొందునని చెలులఁ నావల నిలిపి తన వల్లెపంచె వలవోలె దానిపై విసరి నేరు పునఁ బట్టుకొని యొడిలో నదిమి యుంచెను.

ఆయద్భుతపు కప్ప యొడలు పరీక్షించి చూచి యావాలు
గంటు లెల్లరు నిడిపుట్టినచో టల బంగరుకొండయో, పాల
కడలియో, ఇంద్రధనుస్సు పుట్టెడుతావో యయియుండవలె.
కాకున్న నిట్టి యొప్పగు రూపెచటనుండి వచ్చును? అని
యరుదుపడుచు దానితో నాడుకొన సాగిరి. రాజకూఁతు
రొక కొంతసేపావింత కప్పనాడించి, కప్పకు వెఱచి యావ
లకుఁ జనుచున్న యొకముసలి బ్రాహ్మణునిమీఁద నవ్వుతాలకు
విసరివైచెను. అందులకా భూసురుఁడలిగి చెలులతో నిపుడ
నీవొక యాడుబోదురు కప్పవై యీవింతకప్పకు భార్యవు
కమ్మని శపించె. తత్ఫలముగ వారందఱు నపుడపుడ యట్టు
లయై యయుత శాలూర చక్రవర్తికి రాణు లైరి.



## అయుతుని శాపాంతము

మున్ను తనకు బహిఃప్రాణములై యొక్కకుత్తుకగా
నున్న చెలికత్తె లెల్లరు నపుడు సవతులు గాఁగాఁ గాన్య
కుబ్జకన్య కప్పరూపున నావింతకప్పతోఁ గాఁపురము
సేయఁ దొడఁగె. వలదు మొఱ్ఱో యని గోలవెట్టిన యయుత
మండూకము, భార్యాశతములతో సంసారము నీఁదుచుఁ
దల మునిఁగి యుండెను. అది యా చదు వెచట నెపుడు
నేర్చెనో గాని, యిల్లాండ్ర నెల్ల సమానముగ నెఱపుచు జీవ
యాత్ర జరుపుచుండె. నాచేజేత సృజింపఁబడిన యీయువతి

నీ యడుగునీడలలో నడచుఁ, గొను మని నలువ యంపఁ గా దనినవాఁ డిపుడు మందాకసతి కోపింప దరి కరిగి పాదము లంటి యలుకలు కూడఁ దీర్పఁ దొడఁగె.

అట్లు కొంతకాలము గడచినవెనుక నయుతునకును, నారాజుకూఁతునకును నొక తనయుఁ డుదయించెను. దానితో నాతనిశాపపుచీఁకటులుగూడ విరిసె. జ్ఞానచంద్రుఁ డుదయించి విష్ణుపదము లెస్సగఁ గానవచ్చె. అంత నయుతుఁడు తన శాపవిముక్తికిఁ గారణ మగుటన నరహరిదేవుని వేభంగులఁ గొనియాడి పాడి యాదేవదేవుప్రసాదమును శిరసా ధరించి యథేచ్ఛం జనెను.

నాఁటఁగోలె నయుతునిచరిత్రము చిత్రచిత్రమై ధాత్రీతలమునఁ గవిజననుతిపాత్ర మయ్యె.

# నత్కీరుఁడు

## ౧

### పాండ్యరాజు సభ

శ్రీమంతమై ద్రవిడ వసుమతీమతల్లికి సీమంతమై, మధురయను పట్టణము గలదు. అది నేఁటికిని బ్రసిద్ధముగదా. అది సకల సంపదలకుఁ గాఁపురమై కుబేరునియలకాపురమా యన మెఱయు. అందు శివుఁడు మీనాక్షియని పిలువఁబడు తన దేవేరితో నెలకొని కొలువుదుకాంద్ర కొంగు బంగారమై వెలయుచుండు. మున్ను ముక్కంటి కంటిమంట రతి పసుపుకుంకుమమును దుడిచివేయ విలపించు నాపెపై దయ గలిగి సర్వమంగళా మహాతల్లి క్రీగంటిచూపు వెండియు నామె మాంగల్యమును నిలిపె. సాక్షాల్లోకజనని యట్టి మీనాక్షికరుణాకటాక్షములచేత నెంతయు ధన్యులై మధురాపురము వారెల్లరు సుఖముగఁ గాలము గడుపుచుండిరి. వారల కట్టి వైభవము లభించుట కచటి తామ్రపర్ణీనదీ పుణ్యోదకంబుల స్నానపానవిశేషమే కారణ మనక తప్పదు.

మున్నొకతఱిని పాండ్యుఁడను రాజు మధురాపురమును రాపులేక పరిపాలించెను. అతఁడు సామాన్యుఁడు కాఁడు. ధీనిధి. పరాక్రమక్రమమున నేగాక అనురంజకముగఁ

ప్రజాపాలనమున నాతని మించిన చేతులులేవు, అర్ణవము వోలె గంభీరుఁడై దానమున రెండవ కర్ణుఁడని యెల్లకడల నాతఁడు వన్నెకెక్కె. శౌర్యము, ధైర్యము, భూమిని భరించుట యందారి తేరిన నేరుపు, హిమప్రభాసముజ్జ్వల మైన కీర్తి, నిండారి, యామహీభర్త కులగోత్ర పాత్రుఁడై మంచు కొండవోలెఁ బేరొందె.

వింధ్యపర్వతముతల నదిమి కుంభసంభవుఁడు లోపాముద్రతో మలయాద్రిపైఁ గాఁపురము వెట్టె. ఆముని కొకనాఁ డొక యూహ తోఁచె. ద్రావిడశబ్దశాస్త్రమున నొక నిఘంటువు, అలంకారశాస్త్రము, అందు రమణీయమైన కవిత్వము చెప్పెడు లక్షణము, నిర్మింప వలె నని కలశజుని తలఁపు.

అట్లు తలపోసి యగస్త్యుఁడు, నిర్మలినమైన యొక శంఖఫలకమున నష్టాదశాక్షరమాతృక వ్రాసి, యద్దానిం గొని మధురాపురమేలు పాండ్యభూపాలునిపాలికిం జని యి ట్లనియె—రాజా! హంసవోలెఁ దెల్లనై పవిత్రమైన యిది యొకశంఖఫలకము. సింహాసనముం బోలినయది. శారదాదేవికి సరివచ్చు మహనీయు లిందుఁ గూర్చుండఁ దగినవారు. అట్టివారి కెందఱికైన నిది పుష్పకమువోలె నవకాశ మిచ్చుచుండు. ఒక్కరుఁడుమాత్రమే లభించిన, నతని కొక్కరునికే సరిపడు తా విచ్చు. ఇద్దాన మీ కెల్ల కడల సెన లేని గారవ మతిశయిల్లు. కావున మీతరతరము దీని నత్యాదరమున నర్చించుచు యశముఁ గాంచుఁడు.

పాండ్యరాజతిసంతోషమున నద్దానిం గొని, కలశజు
నధికభక్తివినయతాత్పర్యంబులఁ బూజించె. మునియు వాని
ననుపుగ దీవించి తనయాశ్రమమునకుం జనియె. నాఁటఁ
గోలెఁ బాండ్యభూపాలునియాస్థానము శారదాదేవికి మంది
రమై. కవి పండిత గాయక మణిగణ సమలంకృతమై దెసల
వెలుగొంద సాగె.

ఆ పాండ్యునితరువాతఁ బలువురు పాండ్యభూపాలురు
మధురాపురము నధరీకృతసురపురముగఁ బరిపాలించిరి.
కొన్ని తరములకుఁ గలియుగమునం దాతనివంశమున నొక
రాజశిఖామణి యుదయించె. అతఁడు పాండ్యధాత్రీధౌరం
ధర్యమున దుర్నివార్యుఁడై నిలిచి, కులపర్వతములకు, దిగ్గజ
ములకు, నాదిశేషునకు, బరువు తొలఁగించి పేరుగాంచి
ద్రావిడభాషాదేవికిఁ గంఠాభరణమన మెఱసె.

ఆ కళాకుశలుఁడు కళాపోషకుఁడై, కలశజునిచే
నొసఁగఁబడి ద్రావిడ కవితాశ్రీ విపులమైన శంఖ ఫలక
మున వసింపఁదగు మహాకవుల నారసి యారసి సురగురువు
నకు సరివచ్చు మనీషావైభవమున నసమానులై, శైవాగ
మము పేరి కాసారమున రాయంచలో యనఁ దగు నక్కీ
రాది కవీంద్రులఁ బన్నిద్దఱ రప్పించి, యందుఁ దగురీతి నెల
కొలిపె. ఆ కవీంద్ర చంద్రుల యలంకార వైభవమునఁ
బాండ్య భూపాలునిసభ దేవసభవోలె మెఱయుచుఁ దద్వ
చోమృత పూరమున సభిక చకోరములకు విందులు వెట్టుచు
వెలయుచుండె.

ఆ సభ మెచ్చునట్లు కవిత్వముచెప్పఁగల సరసున కరుసమునఁ బాండ్యరాజు చేసేత వేయేసిమాడలు కానుక వెట్టి గారవించు చుండెడివాఁడు. దానంజేసి పూవు తుమ్మెద లంబోలె మూల మూలల నున్న, నానా కవి పండిత ప్రకాం డుల నాకర్షించి యారాజు కొలువు కూటము, తన్మృదు మధురవచో విశేషములు కాలియందియల మ్రోఁతలుగ శారదా దేవికి రంగస్థలమై, నిచ్చక్రొత్త బెడంగుల నతులమై తేజరిల్లసాగె.

## ౨

### మధురాపురమునఁ గఱవు

అవ్వాఁడువున నడుగుటయు తడవుగ నర్థులకు వలయు నర్థము లిచ్చుచు, నాప్తులకు మనసిచ్చుచు, గూటమిం గూర్చు దేవేరుల కెల్లసౌఖ్యములు నొడగూర్చుచు, బందుగులకు వలయు సంపద లందిచ్చుచుఁ, దనరాజ్యమునఁ గల యెల్ల జాతుల వారికి బాంకమి నేర్పి తదభిమతార్థములు సమకూర్చుచు, దాయలపొడ వడగించి సాధువుల కెల్లవేడు కలు వెలయించుచు, నాపాండ్యభూపాలుఁడు భూపాలనము సేయుచు నుండ, నొక్కతఱి, గ్రహములు వక్రించి, గతులు తారుమారై, లోకమున నమంగళము, అశాంతి, రేఁగి, తుద కొక్కపెట్టునఁ బెద్ద కఱవు సంభవించెను.

ఆసమయమున శని మీనమునఁ జొచ్చి కదలక మెదలక యందు నిలిచి పోయె. తూరుపుదెసఁ దోఁకచుక్క త్రాఁచుపామువోలె బయలు దేరె. అనుదినముఁ బవలు రెండు జాముల వేళఁ జెవులు చిల్లులు వైచు పెద్దపెద్దయుఱుములతోఁ గాలిమబ్బుల యార్భాట మలవాటుగ నెఱసి సన్నని మంచు పాటియైననుఁ జేయని చినుకు చినుకసాగె. రాత్రులయందాకసము నిర్మలమై కనుపట్టఁదొడఁగె. వెలియెండలు మెండయ్యె. గాలి మచ్చునకును లేదయ్యె. వర్షగర్భము నడవడి దప్పి చప్పఁబడియె. విదియలయందుఁ జంద్రుని కొమ్ము తలిగిపోఁజొచ్చె. కన్య భిన్నింపక భీష్మించె. మఖా ప్రవేశకాలమున నుఱు మను మాట యేయూరఁ టోఁపనిదయ్యె. తొలకరితఱి దక్షిణపుదిక్కునఁ బ్రళయమునఁ బోలు గర్జలతో మేఘములు ఘూర్ణిల్ల సాగె.

ఇంక నేమన వలె? ఎల్లలోకములు నాహారము లేక, ఎండ వేఁడిమికిఁ దాళఁజాలక, నోనియుక్కలో నుక్కి యుక్కిరిబిక్కిరి యవుచు, నల్లడతల్లడ గుడువసాగె. గునుకులు, ఊదలు, బరపటలు, గోళ్ళగొండులు, అల్లిబియ్యము, వెదురుబియ్యము, గొట్టెచెట్లు, తుంగముస్తలు, ఈఁతగుంజు, తాఁటిగుంజు, మున్నగునవి దొరకినవి తిని జను లాకలిమంటఁ జల్లార్చుకొన దొరకొనిరి. అఱువది దినములకుఁ బండి కుడువవచ్చును గదా యని యోపిక లేకున్నను బ్రదుకుపై గంపెఁడాస పెట్టుకొని కొందఱు మళ్ళు సేసి తమిదలు చల్లి, దొఱువులు దీసి యేతామూలెత్తి మొలకఁ బెంపఁబూనిరి. కాని దైవ

నియోగ మేమన వలె? పతియులు పతియులై యా మఖ్య మల్లె పడి మొదలంట మంటిపాలయ్యె.

భయంకరమై యట్లు మానశనిదోషము తాఁకుటం జేసి పుడమి నిరస్త సస్యమై నీరసించి పోవ క్షామదేవత విజృంభించి గంటలతోఁ బ్రళయతాండవముఁ జేయుచుఁ బరివారముతో నెల్లెడ నెదురులేని విహారము సేయు నయ్యవసరమున, మేనఁ దోలును, ఎముకలును మిగిలి త్రోసినఁ దొంబదిచోట్లఁ గూలువారును, ఆలిని బిడ్డలను విడిచి యాఁకటి చిచ్చున వెచ్చపోవు వారును, ఏలిక బంటు అను విచారములేక యేకడ నొకయించుకయు లభింపమిఁ గృశించువారును, నయి ప్రజలెల్లరుఁ దూలిపోయిరి.

చావనీక చచ్చియుం జావని కుక్కలం జేసి గుంటల కీడ్చుటకో యన నడుమ నడుమ దైవవశమున దొరకు నాకు నలము దిని, మరల లేమి నవయుచు, గంపెఁడాస రోజు వుచ్చుచు, రోసిరోసి హతాశులై భువి నొరగి లేవనోపక శివ శివ! జీవకోటి జీవానిలములు విడుచు దుర్గతికయ్యె.

ఆఁ తెఱగునఁగ అవంతింతకు నంతుమీఱియడపరానిదై పోవ మానిసి మానిసిం దిను కంకాళపరిస్థితు లేడుపడి నేల గగ్గోలు పాలయ్యె.

అత్తఱి నొకపాటుఁ డయ్యెడ నిలనేరక, యొండెనిం బోఁ దలఁచి, మధురాపురముఁ బాసి, నడువలేక తూలి పడు వాఁడయ్యుఁ జేయునది లేక మెల్ల మెల్లన పయనమ్ము సాగించుచుండె.

కొంత దవ్వరుగునంత కాతనిపైఁ గరుణించి శివుఁడు ప్రసన్నుఁడై యిట్లనియె— ఓయీ! నీవెందులకుఁ బోయెదవు? అచట మాత్రము సుఖము కలుగుననన నమ్మకమేమి? వలదు. నీ ప్రయాణ మాఁగుము. ఈమధురాపురి నేలు పాండ్యరాజుపై నఱవబాసలో నే నొక పద్యమును వ్రాసి యిచ్చెద. నీవద్దానిం గొని వానిపాలికిం బోయి చదువుము. అందుల కాతఁడు మెచ్చి, నీకు వేయినూడల ముడుపిచ్చు. అది నీ వెచ్చమునకు వచ్చు. నీవగయుఁ దొలఁగు. నొవ్వక బ్రతుకఁ గలవాఁడవు. అంతియగాక, నీకలవుతోఁ బాటు నీతోటి యెల్ల ప్రజల కలవును దీఱు. లోకమున హర్ష ముత్కర్షమై మిన్నుముట్ట వర్షము గురియు. సస్యములు పండు. లోకముల కెల్లఁ బండువు కాఁగలదు. నీ విటు పోవలదు. మరలి పురికిఁ బొమ్ము. అని నొడివి చంద్రకళాధరుఁ డొక పద్యము వ్రాసి యాభూసురునకుఁ జెప్పి యంతర్ధానము నొందె.

ఆతఁడును బరమానందమున నెగయుచు రాజశేఖరుని రాజత్కృపారసలీలావిశేషములఁ బొగడుచుఁ బాడుచు మరలి పాండ్యరాజుకొలువుకూటమునకుఁ బోయి యాతనిపేరోలగమున నెల్లరుఁ జూరఁగొనఁ బరమేశ్వరప్రణీతమైన కవితారసమును వెదచల్లె.

ఆపద్యమునఁ, "పార్వతీదేవి ధమ్మిల్లబంధము సహజగంధము," అని చిత్రింపఁబడియుండె. అది విని రాజసభ మాఱుమ్రోగిపోవునట్లు వికవిక నవ్వుచు నక్కీరుఁడు శంఖఫలకముపై నుండి—ఏమయ్యా! నీ వేకవిత్వమైనను జెప్పుదువు

గాక, జుట్టు పుట్టువుతోడనే పరిమళము గలిగియుండెనని చెప్పిన లోకము నవ్వదా? నీ వట్టి దెచ్చటనైనను జూచితివా? చాలుఁ జాలు. ఇఁక నటు లెప్పుడును జెప్పకుము. అది సుద్దతప్పు. అంతియగాక, కవితాసమయమున కది యొప్పును గాదు. నీ విది యెట్లు రచించితివోగాని, మా బోటు లున్నసభలఁ జెప్పరానిది—యనె.

పాప మా బ్రాహ్మణుఁడు చిన్నవోయి,—ఇది నాది కాదు, క్షమింపుఁడు. నా కా పరమేశ్వరుఁడు రాజుపై వ్రాసి యిచ్చి పొమ్మనినాఁడు. నే నటులే చేసితి. ఇందలి తప్పొప్పులు నాకుఁ దెలియవు. పోయి వత్తు. సెలవిం—డని గ్రక్కున మరలివచ్చి పార్వతీపతిపైఁ జూపునిలిపి, యాతని పద్య మాతని కప్పగించి, వాపోవుచు ననియె.

పశుపతీ! నిన్ను నమ్మి పోయి పాండ్యరాజునిండు కొలువులో నవ్వులపాలైతి. నక్కీరునివాక్శరములు నా సిగ్గును మొదలంట వెలికిఁ ద్రవ్వి యూడ్చి పుచ్చినవి. సర్వజ్ఞత్వము, బహుముఖనిర్వాహకశక్తిగుణముగలవాఁడవుగదా యని, నిన్ను నమ్మి నానఁబోసికొని, పరుగునఁ బోయి నిండు సభలోఁ బౌరుషగర్వముఁ బోనాడుకొంటి. ముక్కంటీ! తా నెఱిఁగినవిద్యను రాజసభలలోఁ బ్రదర్శించినఁ గీర్తి గలుగునుగాని, యితరులవిద్య ముక్కున నిడుకొని చన్న నేనరుఁడు లెస్స తిరిగి రాఁగలఁడు? ఆఁబోఁతుపై నెక్కి తిరుగు వల్లకాటి బూచులదేవరవు, నీమాటలు నమ్మిన నా కిట్టి యవమానము వచ్చుటలో నచ్చెరియ మేమి? సభలో

నత్కీరునిమాటలకన్న నాకు శూూమవ్యథ యెక్కువా దేవా! అని వెండియు నాపాలుండు—పరమేశ్వరా! ఇంతకును నా భాగ్య మటు లుండ, నిన్ను, నత్కీరుని దూఱఁ బని యేమి? చాలు. ఇదియు నాకొక మేలె యని నాతలఁపు. ఇంతకు నిక్కువుచే నిటు లైతి, నంతియకదా. ఎందైనఁ బోయి, బిచ్చ మెత్తుకొని కడుపునింపుకొనుచుఁ గాలము వేఁచియుండి యీయెడరు దీఱినపదపడి మగిడి వత్తు. నీ విచట భద్ర ముండుము. సెల విమ్ము—అని యడుగులపైఁ బడి వేఁడు కొనెను.

పరమకరుణారసమున మనసు గఱఁగి పరమేశ్వరుఁ డప్పాట నప్పాలుని లేవనెత్తి—ఓయీ! విచార ముడుగుము. నత్కీరుఁడా నీకవిత్వమునఁ దప్పలు వట్టువాఁడు? ఏదీ, నడువు, మచటికే పోదము. ఆతఁ డది తప్పని యెట్లు తెలిసి కొనెనో? ని న్నేటులు ధర్షించెనో? పరీక్షింతుఁగాక, ర—మ్మని తా నొక బ్రాహ్మణుని రూపున నాతని వెంట నిడు కొని పాండ్యరాజుకొలువునకు హుటాహుటిం బోయె.

## 3

## శివుఁడు నత్కీరుని శపించుట

రాజు మున్నుగ సభలోనివా రెల్లరు నావింతబ్రాహ్మ ణుని తేజమున కరుసుపడుచు, నెంతయు గారవించిరి. అంత నాతఁడు లేచి నిలువఁబడి చే యెత్తి, వింజ మూఁకిడినట్లు

సభాస్థానీకము విన, ని ట్లనియె—"సాహిత్య సౌహిత్యములతోఁ జవు లూర నపూర్వముగ నే నీ రాజన్యునిపైఁ గయిత సెప్పి యీతని నంప, మాత్సర్యమునఁ గనులు గుట్టి నత్కీరుఁడు తప్పు వట్టెనఁట. ఏదీ, ఇందు లక్షణమో, అలంకారమో, పదబద్ధమో, రసమో, యేది తప్పుదారిని బట్టెనో వివరింపుఁడు. చూతము. సభలలో వెనుకముందులు చూడ కూరక తప్పులు వట్టువారి నొప్పరికింపరాదు. ఉపేక్షించిన, నది తోటికవిపండితమండలికిఁ దలవంపులు గాక మానదు."

అనవుడు, నత్కీరుఁడు చిఱునవ్వు నవ్వుచు మునుపటి వలె, నధిక్షేపించి యిటులనె—"వేనలి సహజగంధము గలది యని కయితలల్లుట తప్పు గాక, ఒప్పా?"

శి—అవును. గిరితనయాధమ్మిల్లబంధము సహజగంధమే. సందియము లేదు.

న—అవుఁగాక. అది పార్వతికె చెల్లు. అందును నది పరమేశ్వరునకే యెఱుక.

శి—అయిన, నట్లు కవి వర్ణింపఁగూడదా?

న—కూడదు. పార్వతి కేశపాశమట్టిద యయిన, సామాన్య వనితలతల జుట్టునకు సహజగంధత్వము నంటఁగట్టఁ దగునా? అది యనుభవములో నున్నదా? చాలుఁ జాలు. కవిసమయసిద్ధముగాని పలుకు పలికి కవితకుఁ గళంకముఁ గొనిరా, నితని వెంటఁ బెట్టుకొని యింత దూరము పాఱివచ్చితివా? చాలు. పొమ్ము.

శి—ఇప్పటికిని జెప్పుచున్నాను. పార్వతి కేశపాశ మట్టిదియె. ఈతఁ డనినది తప్పుగాదు.

న—నాకది సమ్మతమే. అయినను మన కిపుడీ గగనప్రసూన వాదముతోఁ బనియేమి ? మనము శివలోకములోనివార లము గాము. ప్రత్యక్షము గానిది, సరియైనదియే యగుఁ గాక, నమ్మరానిది. అది పండితప్రకాండుల యొప్పిదము నకు రా నేరదు. మానవలోకములోని వనితల శిరోజ ములు సహజగంధము లెంతమాత్రమును గావు. ఈ లూలామాలపు మాటలు చాలును. తొలఁగి పొమ్ము. అని నత్కీరుఁడు ఖండితముగాఁ బలికె.

అందులకు లోలో సంతసించియుఁ దనభక్తునిఁ గాచు తలంపున నత్కీరుని సమ్మతింపఁజేయ, వెలికి నలుకఁ దెచ్చు కొని, తన నిజరూపమును జూపినఁగాని యాతఁ డొప్పుకొను వాఁడు గాఁడనుతలఁపున నిటలాక్షుఁడు, నొసటఁ బొటమ రింపఁజేసి తన మూఁడవకన్ను నత్కీరునకుఁ జూపెను.

అది గని నత్కీరుఁడు—"ఒక్క నొసటనే గాదు, తల చుట్టుఁ గన్ను లున్నను, బద్యము తప్పు గా దని చెప్ప నెవరి తరమును గాదు. నీ యింద్రజాలము లిచ్చటఁ జెల్లవు నెఱప నుడుగు—" మనెను.

అంత రుద్రుం డా తనియెదురుల కెంతయుఁ గోపించి, "నీ వింతటినుండి కుష్ఠవ్యాధివాతఁ బడి కుందు" మని దారుణ ముగ నత్కీరుని శపించెను.

శివునిశాపో[క్తికి గుండె గుభిల్లుమని వడఁకుచు నక్కీ
రుఁడు శంఖఫలకముఁ దాసివచ్చి పరమేశ్వరుని పాదములఁపై
బడి, దేవా! నీభక్తవాత్సల్యము నరయక తప్పు చేసితి.
కృపాధామా! ఇందుల కిట్టి కఠోరపు శాపమా? మన్నించి
శాపము తొలఁగిపోవు నుపాయము సెలవిమ్మని వేఁడెను.

శివుఁడును దయగలిగి—కైలాస శైలమును జూచిన
నాఁడు, నీ శాపము తొలఁగు—నని నక్కీరు నను[గహించి
కనుల కెడమై పోయె.

అంత నక్కీరుఁడు తన శాపగతిని, కైలాసగిరి దర్శ
నము తనకుసాధ్యముగామిని దలపోసి కుందుచు నిట్లని
వితర్కించె.

అక్కటా! నేనీ కవితాభిమానము నేల వహింపవలె?
శంఖపీఠమునఁ దక్కిన కవులవలెఁ జెక్కుచెదరక కూర్చుండి
యుండక పరమ శివునితో వాదుల కేల దిగవలసివచ్చె?
దుర్భరమైన కుష్ఠవ్యాధిబాధ కెటు లోర్తు? ఇంకెన్నఁడా
వెండికొండను జూచుభాగ్య మబ్బు? అది నాకు సాధ్యమే?
ఎన్ని మహానదులు, ఎన్ని యడవులు, ఎన్ని కొండలు, ఎన్ని
బోయ పల్లెలు, ఎన్ని మృగములు, పిట్టయు నాడని యెన్ని
మాఱుమూలల [త్రోవలు! నే నివన్నియుదాఁటిపోయి యారజ
తా[ద్రి నెట్లు చూడఁగలుగుదు? సదాశివ! అది యెన్నఁడును
గన్నదియు, గుఱుతుగ విన్నదియుఁగాదే? ఉత్తరదిక్కున
గలదనియేగదా వినికి? అది యిది యని యెవరు నిరూ
పింతురు? ఏమి సేయుదు?

కృత్తివాసా! కైలాసశైలమునకుఁ బోవు త్రోవలు సామాన్యములా? సింగములు, బెబ్బులులు, మదపుటేనుఁగులు, ఖడ్గమృగములు, శరభమృగములు, భయంకరముగ నఱచుచు వందలువందలుగఁ దిరుగుచుండు నే! మాయావులైన రాక్షసు లెడయీక సంచారము సేయుచుందురే! మంచువానలు వెలుపు లేక కురియుచుండునే! మంచునఁ దుసికిలి పడి ప్రవహించుచు నెడనెడ నొండొంటి సంఘర్షణమున బద్ధలై తెల్లరాతిబండలు సందు లీక క్రమ్ముకొని యుండునే! భక్తవత్సలా! పార్వతీపతీ! నీకొండకుఁ గదలి రావలె నన్న నాత్రోవలు మాబోటికొండికల కూహింపనలవి గావే! ఇంక నేఁ జూడఁ గలుగు టెట్లు?

పోనిమ్ము, మెల్లమెల్లగఁ గొన్నియేండ్లకైనఁ జేరుకొంద మనుకొన్న నది చొప్పడదు గదా. నెమ్మేనఁ దిమ్మిరెత్తకమున్నె, పొడలు మచ్చలు పుట్టి దేహ మాపాదమస్తము, జెడకమున్నె, చర్మము బిరుసువాఱి లాగకమున్నె, బుడుపులు పుట్టి యవయవములు పొక్కిపోకమున్నె, లేవలేని తనము పైఁబడకమున్నె, రూపము వికృతమై పోకమున్నె, చీము నెత్తురులు దారలు వడఁ గ్రుళ్ళి చివికి గవులుగొట్టు మేన నీఁగలు దోమలు మూఁగి తినకమున్నె, పిడికెఁడు మెతుకులు బిచ్చ మడుగఁ బోయినపట్ల జనులు చూడ రోసి నడునడు మని విదలింపకమున్నె, కాలాడినపుడ కైలాసగిరిని జూడ నడవవలెఁగదా! ఆలసించిన, హరునిమాట తప్పి చనుపాటిదా! ఇఁక నేటిగతి?

అని యెంతయుఁ బొగిలి తుదకుఁ జింతాపరంపర లను వాన లుడిగి, నక్కీరుఁ డను మేఘము, దక్షిణపుదెస నున్న కవులముఖపంకజములు వికసింప, నుత్తరముగఁ బయనము సాగించె.

## ౪

## నక్కీరుని తీర్థయాత్ర

అట్లు నక్కీరుఁడు వెడలి కతిపయ ప్రయాణములు చనిచని ముందటఁ జెవ్వందీశ్వరుని, జంబునాథశివలింగమును, దర్శించి, కావేరీతీరమున కేతేరె. అమ్మహానది పుణ్యోదక యవుట నందుఁ గ్రుంకి, యానదిం దాఁటి యుత్తరముగఁ బోయి పెక్కు తీర్థములు సేవించుచుఁ బోయి, అరుణాచలమును, ఉణ్ణామల పార్వతిని, అణ్ణామలై విశ్వనాథుని, దర్శించి సేవించెను.

అటనుండి కదలి తిరువత్తూరు, మున్నగు దేవస్థానములఁ దిలకింపుచు నడచి, కాంచీపురి, పెన్న, గుండ్లకమ్మ, కృష్ణవేణి, గౌతమగంగ, పీఠికాపురము, సింహాచలము, శ్రీకూర్మము, గోకర్ణము, పురుషోత్తమము, కృత్తివాసము, కటకము, జలేశ్వరము, నందనేశ్వరము, గగనేశ్వరము, గయ, మున్నగున వన్నియుఁ దిలకించి సేవించుచుఁ జని నక్కీరుండు కాశిం జేరె.

అందు గంగాస్నానము చేసి, విశ్వనాథుని, విశాలాక్షిని, అన్నపూర్ణను గొలిచి, కాలభైరవుని, డుంఠివిఘ్నేశుని బిందుమాధవునిఁ గని మ్రొక్కి, కైలాసగిరిని జూచు వేడుక నచటనుండి వెండియు నుత్తరాభిముఖముగ వెడలె.

అట్లుకొన్ని క్రోసులు నామడలు పోయిపోయి నత్కీరుఁడు వాడి నవసి యిఁక నడువ నోపిక లేకయు నడుమ నడుమ నడుముఁ బట్టుకొని నిలఁబడి యమ్మయా యని కూర్చుండియుఁ దొంగి దోఁగియు మఱికొంతదవ్వు పయనించె. అప్పటి కాతని జవసత్త్వము లుడిగిపోయె. అడుగులు బొబ్బలు పొక్కిపోయె. ఇఁక నడుగొక యామడగా నగుచుండె. మేనఁ జీము నెత్తురు చిప్పిలసాగె. అంతకు విడువకాతఁ డెట్టెటో నడచి తుట్టతుదకొక భయంకరమైన నిర్జనారణ్యమునఁ జేరె. దట్టముగ నల్లుకొన్న చెట్లనీడలఁ గాఱుచీఁకటులు గాయు నయ్యడవిలోఁ జిక్కి దిక్కు మ్రొక్కెఱుఁగక దేవురులాడుచు నాతఁ డావురు మని యెల్లెడఁగలయఁజూచె. అపుడాతనికిఁ గట్టెదుర నొక తమ్మికొలను కన్నుపండువుసేసె. దప్పిచే గొంతు తడి యాఱిపోవుచున్నకతన నద్దానిం జూచినంతనఁ బ్రాణము లేచి వచ్చి యాకవిచంద్రుఁడు లేనియోపిక దెచ్చుకొని యెట్టెటో కొలనిపొంతకుఁ బోయె.

ఆకొలనియొడ్డున నొక మఱ్ఱిచెట్టు గలదు. అది మహోన్నతమై, మహాద్భుతమై నత్కీరునకుఁ గనుపట్టె. ఆమఱ్ఱిచెట్టుక్రింద దట్టముగ నాకులు రాలి పరుపులు వైచిన ట్లుండెను. అవి చూడఁ జూడ ధరారమణి ధరించిన పచ్చని

పట్టుపుట్టముమేల్కట్టో యనఁ దనరుచుండెను. పొడవులై సాఁగి యాకాశముదాఁకఁ బోయిన దానికొమ్మలగుబురులు సురలోకమున మరకతమణులచే నిర్మింపఁబడిన మేడలో యన నొప్పారుచుండెను. దాని వ్రేలుఁగొమ్మలు మునుల కేర్పరుపఁ బడిన పర్ణశాలలో యనఁ దనరుచుండెను. దిక్కులచివళ్ళ వఱకుఁ జుట్టును వ్యాపించిన దానికొమ్మలనీడ పర్వతముచుట్టు దట్టముగాఁ బట్టిన పచ్చికతీవయో యనఁ గనఁ దగి యుండె. అట్లు రమణీయదర్శనమై యామఱ్ఱి వాలఖిల్యాది మహర్షుల కావాసమైన రోహణమో, గయలోఁ బితృముక్తిదేహమై ప్రసిద్ధిగాంచిన యక్షయవటమో యన నొప్పారుచుండె.

నక్కరుండును మెల్లమెల్లన దాని క్రిందకుఁ బోయి, తదీయశాఖాసముదాయము చల్లఁదనమున కెంతయు సంతసిలుచు దానినీడం గూర్చుండి, కను లెత్తి యద్దానివైభవమును బడుదువుగఁ జూచుచుండె. తమ్మిపుప్పొడులు మోచుకొని వచ్చిన కాసారగంధవాహ మతనిమార్గశ్రమమును కయితముఁ దొలఁగింపఁ దొడఁగె.

అత్తఱి నామఱ్ఱినుండి కొన్నిపండుటాకులు జలజల నేల రాలె. అందుఁ గొన్ని కొలనినీటిలోఁబడి, వెనువెంటన చేపలుగా మాఱిపోయె. నీటివెలుపలఁ బడిన యాకులు పక్షులై కిలకిల మని యెగిరిపోయె. అది యంతయు నక్కరున కొక వింతగఁ దోచె. ఒక యాకు సగము నీట, సగము బయటఁ బడి, సగము చేపయు సగము పక్షియు నయి, అటు నీటిలోనికి, నిటు వెలికిఁ దా నొకటియ లాఁగుకొన

పోఁగ. ఆ చమత్కారమును జూచి నత్కీరుఁ డత్యంతభయపర వశుఁడై యుండె.

ఆసమయమున మఱ్ఱిచెట్టుక్రింద నొకమూల వికటాట్ట హాసములు సేయుచుఁ గొన్ని భూతములు నత్కీరునకుఁ గనుపట్టె. వానిం గనినంతన నత్కీరుండు గుండె పగిలి అల్లడ తల్లడ గుడవసాగె. ఆభూతములనడుమ లావు మెఱసి యొక మహాభూతము, త్రోవ నొంటిఁ జను పాంథులవెంట నంటి తోడు నీడగాఁ జని చావ మోదుటయు, బోయీలట్లు పల్లకీలు మోయుచుఁ బోయి తమ్ము నమ్మి తలఁచినయనఁదల వల్లకాటఁ దార్చుటయు, రాజును బలగములుఁబోలె వేసములు వేసికొని యూళులపై దండెత్తి వచ్చి పడి మంగళముఁ బాడించుటయు, నేలకు నింగికిఁ దాళములు వేయించి నేలమాలెలు ద్రవ్వ నేరుపులు, గరిడీలు వెట్టి తోటిభూతముల కెల్ల నేరుపుచు నత్కీరునకుఁ గట్టెదుటఁ గృతాంతుఁడువోలెఁ గనుపట్టె. వానిచుఱచుఱని చూపుల మిఱమిఱలాడు గ్రుడ్లు, కోఱలు, ఏఁదుముఁడ్లువోలె నున్న యూర్ధ్వకేశములు. కాఱుమబ్బుఁ బోలిన నల్లని మేను, నిష్ఠురవాక్యములు, వికటాట్టహాసములు, నక్కకూఁతలకు సరివచ్చు నెలుఁగు, భయంకరమై చేతఁ బాతరలాడు హేతి, ఎమ్ములదండలు, చూచినంతన నత్కీరుఁడు నిట్టనిలువు నీరయి యుసుఱు దొఱఁగినటుల యయ్యె.

అంతలోన నాభూతపతియు నొక్కగంతున నెగిరిపడి నత్కీరుని వెలఁగపండుంబోలెఁ బట్టి యెత్తి కొనిపోయి

యొకకొండగుహాలో నిడి ద్వారమున కడ్డముగా నొక
ఱాయి ద్రోచి యఱచుచు మఱ్ఱిదరికొలన నుదకమాడ
బరుగునఁ బోయె.

నక్కీరునకు మున్నె యాభూతనేతచేఁ గొనిరాఁబడి
గుహాలో నుంపఁడిన మనుజు లప్పుడు గుంపులు గుంపులై
తట్టఁ బడిన పులుఁగులట్టు లిట్టట్టువడుచు నక్కీరునిం గని
యెలుఁగెత్తి యొక్కపెట్టున గొల్లుమనిరి. నక్కీరుండు
నేమియుఁ దోఁపక, అన్నలారా! ఇది యేమి? కలతెఱఁగు
దెలుపుఁ డని వేఁడ వా రాతని కిటులనిరి.

ఓయీ! నీ వెవ్వఁడవో ఎందుండి వచ్చితివో కాని
నేఁడు నీయొకనిమూలమున మా యందఱప్రాణములును
బోయినవి. ఇంతకు ని న్నేమనవలె? ఆచతురాననునకు
మాపై నిట్టి కరుణ కలిగినది. అందఱకు నొక్కమాఱుగా
సంఘమరణమును లిఖించి నిన్ను బచ్చిపెట్టినాఁడు. ఈకఱకు
పిసాసి కనుగొన్నంతన మనుష్యులను నూఱుక త్రావువాఁడు.
నూఱువురైనఁగాని పంటిక్రింద నాటియుండ రని నూఱు
వురఁ గూర్చి తుదకుఁ దినుచుండు మేము నీతో నిప్పటికి
సరిగా నూఱుగుర మైతిమి. ఇంక నొక క్షణములో నతఁడు
వచ్చి పడి మనల నందఱ నప్పడములు వోలెఁ జప్పరించివైచు.

నా విని నక్కీరుఁడు నగుచు ని ట్లనియె.— ఇందులకా
మీరు వగచునది? మనకు వచ్చిన భయము లేదు. ధైర్య
ముగ నుండుఁడు. తారకాసురదమనుఁడు నాకూర్చుదైవము.
మనదుర్గతి నాస్వామికి విన్నవించుకొనెద. తారకునిఁ బోర

మన్నిగొన్న యాజగ జెట్టికీ పిపాసిపురు గొక్క లెక్కయా! క్రౌంచగిరి నొక్కములికి యేసి చించినరౌద్రమూర్తికీ ఈతి బండ యొక పెద్దయా? భయపడకుఁడు. వాని వేఁడుకొనెద.

అని నక్కీరుఁడు వారికి ధైర్యముఁ బురికొలిపి బ్రహ్మణ్యోక్తియుక్తముగా నిష్టదైవమగు సుబ్రహ్మణ్య స్వామి నధికనిష్ఠ సన్నుతించె. కుమారస్వామియు నాతని మొఱ విని యనుగ్రహింప, నపుడవచ్చి గుహాద్వారమును దెఱచుచున్న భూతముపయిం బడి భూతలమునఁ బడఁ దన్ని బిలద్వారంబుఁ దెఱచి లోనివారల నెల్ల వెలిఁ జేరిచె. వారు నిందుశేఖర నందను నానందమున సందర్శించి వందనములు సందడించుచు నక్కీరుం గొనియాడుచు నెందేనిం బోయిరి.

౨౫

## నక్కీరుని సాయుజ్యము

నక్కీరుండును వ్రణకిణాంకితదేహుం డగుట లేవ లేక యచటన యుండి కుమారస్వామికి బునఃపునఃప్రణామము లర్పించుచు నిటులు విన్నవించుకొనె.

దేవా! పరమేశ్వరుఁడు చేఁజేతఁ గూర్చి పంపిన పద్యమునఁ దప్పువట్టి వాదించితి. అద్దానఁ గినిసి మీతండ్రి నాకీ భయంకరవ్యాధి గలుగునటులు శాప మిచ్చె. నేను వెంటన నే నడుగులఁ బడి వేఁడఁ గైలాసమును జూచిన

శాపాంత మగు నని పరమేశానుఁ డనుగ్రహించె. అద్దానిం జూచుకోరిక నిటు లేతేరి యీగతి కయితి. దేవసేనాపతీ! ఏదేనిఁ ద్రోవ చూపి నన్నుఁ గాపాడుము.

నా విని కుమారస్వామి, నత్కీరా! పరమేశ్వరుఁడు నిన్నుఁ గైలాసమును జూడ మనెనుగాని, ఉత్తరకైలాస మని యనలేదుగదా. నీ వింతదూర మేల వచ్చితివి? దక్షిణకైలాసమును జూచినఁ జాలునుగదా. కానిమ్ము. అయిన దేదియో అయినది. ఇఁక నీకు శాపాంతము కాఁగలదు. దక్షిణకైలాసమును జూచు ప్రయత్నమును జేయుము. మే లొందెదవు. ఆమఱ్ఱిక్రింద నున్న తామరకొలనిలో స్నానము చేసి దక్షిణకైలాసమునకు బయలుదేరుము. ఆడఁ బోవుతీర్థము నీ కెదురు కాఁగలదు. అని యనుగ్రహించి క్రౌంచభేది యంతర్థానము నొందె.

సేనానిపలుకుల కెంతయు విధేయుఁడై నత్కీరుఁ డచటినుండి మెల్లమెల్లన తామరకొలనికిఁ బోయి యందు మునిఁగి తల యెత్తునంతలో నెదుట సువర్ణముఖరీతీర విరాజమానమైన దక్షిణకైలాసము కానవచ్చె. వెనువెంటన మేని కుష్ఠవ్యాధియు మానె. అంత నబ్బురవడుచు నత్యాదరమున నద్దానిం దఱిసి నత్కీరుఁడు సువర్ణముఖరీపుణ్యోదకముల దీర్థ మాడి పరమేశ్వరునందు తనమనము నిలిపి ద్రావిడమున నూఱుపద్దెములతోఁ దరుణేందుశేఖరునిఁ గొనియాడె,

జ్ఞానప్రసూనాంబాసనాథుఁడైన శ్రీకాళహస్తిపతి యతనిస్తుతికి సంతసించి దరిసెన మిచ్చి వరము వేఁడుకొమ్మనియె.

నత్కీరుండును బరమేశు ననేకవిధముల వినుతించి శివసాయుజ్యము గోరె.

శివుఁ డందుల కియ్యకొని చిఱునవ్వున నత్కీరునిఁ దనయంతవానినిఁ జేసె.

# సుధన్వుఁడు

## ౧

### హంసధ్వజుఁడు యజ్ఞాశ్వమును బట్టుట

రాజసూయము సేయఁ దలపెట్టి ధర్మరాజు యజ్ఞాశ్వమును విడిచిపెట్టెను. దాని నెవ్వరుఁ బట్టుకొనకుండఁ గాపాడుకొనుచుఁ బట్టుకొన్నవారినిఁ బట్టి పులికాఁపువెట్టి నానావిధ మణిగణ వసన వాహన స్యందనాదికములు కానుకలుగాఁ గొనుచు ధనంజయుఁడు శ్రీకృష్ణసహాయుఁడై సేనలతో బయలుదేరెను.

ఆగుఱ్ఱము సయితము యథేచ్ఛాగమనమున నెదురు లేక పరుగిడి నానాదేశములు త్రొక్కి చూచుచుఁ బోయి పోయి. దక్షిణదిశామండల మండనంబైన మాహిష్మతీ నగరమును జేరఁ బాఱెను. అటనుండి బయలుదేరి యది వెండియు వింధ్యారణ్యమార్గములంబడి పుడమి వడఁక వడివడిఁ బాఱి ఖురాహతుల రేఁగిన పరాగ మాకస మంటుకొని ముంగల నున్న దేశములవారికిఁ దనరాక మునుమున్న యెఱిఁగింప, వాయువేగమునఁ బోయి పోయి చంపకాపురమును జేరెను.

చంపకాపురమును హంసధ్వజుఁ డను మహారాజు పాలించుచుండెను. అతఁ డనన్యసామాన్యమైన పరాక్రమ

మున నెదిరి లేక శతమన్యుఁడు వోలె నెల్లెడల నెల్లజనుల పొగడితల కెక్కి యలరారుచుండెను. వాని బలసంపత్తికి మేర లేదు. హంసధ్వజుని మహావాహినిలో నుద్దండు లని పేరు గాంచిన దండనాథులు డెబ్బదిమంది గలరు. ఒక్కొక దండనాథునియధీనమున డెబ్బదియొక్క వేయి యేనుఁగులు, అన్నియ రథములు, జవసత్త్వములలో నద్వితీయములై యాశుగత్వమున నాశుగముల సరకు సేయని లక్ష సైంధవాశ్వములు, అందఱు వీరభటులు, గలుగ, హంసధ్వజుని సైన్యసాగరము లోఁతు పాఁతు దెలియరాక, గంభీరమై, భయంకరమై, యొప్పు. హంసధ్వజునిపేరు విన్నంతన శత్రు రాజులధ్వజము లెగిరి చినిఁగి పీలికలై విఱిఁగి పడుచుండెడివి.

ధన, బల, సురథ, సుధన్వ, సుబల, ధర్మబాహు లనువా రాతండ్రికిఁ దగిన కొడుకులుగ నెల్లవలఁకులఁ దను భుజస్తంభములనీడల నిలుపుచు నుండ హంసధ్వజునియశో వైభవము దిగంతవిశ్రాంతమై యాతనిరాజ్యము ప్రాజ్యమై యతిశయిలుచుండెను. చంపకముదరికిఁ దుమ్మెదలువోలె హంసధ్వజభుజపాలితమైన చంపకాపురిచాయలకు దాయలు కలనైనఁ దమకనులు త్రిప్పెడువారు గారు.

అంతియగాక, హంసధ్వజుని చంపకాపురమున వారు వీరు ననక, అందఱు నేకపత్నీవ్రతస్థులు, అందఱు సత్యభాషణులు, అందఱు వదాన్యశిరోమణులు, అందఱు నాహవోత్సాహవివశులు నవుట యొక మహాద్భుత విశేషము. అది యారాజచంద్రుని ధర్మపరిపాలనము మహిమమే.

ఒకనాఁటిప్రొద్దున నామహారాజు మంత్రిసామంత పురోహిత కవి విట నట గాయకాదులతో నిండుకొలు వుండెను. అత్తఱిఁ గొందఱు చారు లేతేరి చాఁగిలి మ్రొక్కి ఈని ట్లు లని విన్నవించుకొనిరి.

దేవా! మనపురము నంతపొంతల నొక సైంధవము యథేచ్ఛముగ విహరించుచున్నయది. అట్టిదాని నింతకు మున్ను మే మెన్నఁడును జూచియుండలేదు. నిండు చందురునవ్వు మవ్వపువెలిమేను, పచ్చని తోఁక, నల్లని చెవ్వులు, పగడములవలె, గోరోచనమువలెఁ గుంకుమము వలె మెఱయుమెడ. నున్నని జాలుపొట్ట, చూడఁ జూడ నా హయరత్న మెంతయు సొంపు గులుకుచున్నయది. ఆయు తమాశ్వము మనసాహిణమున నున్న బంగారు గురియఁ గల దని మామనములు తడవుకొనక చెప్పుచున్న యవి. కాని, ప్రభూ! ఇం దొక విశేషముగూడఁ గలదు. అద్దానిఫాలభాగమున నొకపట్టము కట్టఁబడియున్నయది. అం దిటులు సువర్ణాక్షరములతో లిఖింపఁబడియున్నది.

"దుర్జయమైన రాజమండలమునకు విధుంతుదమూర్తి యైన ధర్మజునిరాజసూయయాగమున కంగముగ నీవారువ ముత్సర్జితమైనది. ఇద్దానివెనువెంట నర్జునుఁడు శ్రీకృష్ణుఁడు తోడుగా నంగరక్షకుఁడై సేనలతో వచ్చుచున్నవాఁడు. రాచఱిక మున్న రాజు లెవ్వరేనిఁ బట్టుఁడు. లేదో ధనం జయుని శరణ మనుఁడు."

మే మా యశ్వరపం క్తిని గనులారఁ జూచి నో రారఁ జదివితిమి. గుఱ్ఱమును బోఁగొట్టుకొనుటకు మాత్రము మామన సొప్పుటలేదు. ముంగలికర్జమునకు దేవర ప్రమాణము.

ఆపలుకులు విని హంసధ్వజరాజహంస మచటన కొలువు సేవించుచున్న మంత్రిపుంగవులతో ని ట్లనియె— వింటిరిక దా చారులపలుకులు. మనము హయమును బట్టుట యెటులున్నను ధనంజయసహాయము నెపమున శ్రీకృష్ణభగవానుఁడు మనపట్టణమునకుఁ దనకుఁదానుగ విచ్చేయుట మనభాగ్యమె కాక వేఱొండు గాదు. ఏండ్లుబూండ్లుగ నారాధించుచున్న మనపై నాదయామయున కీనాఁ డిట్టి దయ యకారణముగ నొదవె. శ్రీహరిచరణారవిందముల సందర్శనమునకు మనకుఁ దగినయదను దొరకినది. ఇప్పుడిప్పుడ పోయి యమ్మఖాశ్వమును బట్టి ధనుర్ధారియై యర్జునునితోఁ గదలి వచ్చునా దరధారినిఁ జూచి పుట్టువునకు ఫలము సంపాదించుకొందము. మీ రందఱును సేనల నాయత్తపఱచి, సమరసన్నాహమున నుండుఁడు—అని యానతిచ్చి హంసధ్వజుఁడు, శంఖుఁడు లిఖితుఁడు నను తన పురోహితులం జూచి—సత్తములారా! నాముదలమేరకు మీఱి పోరితమునకు రాక తడసినవారినిఁ బట్టి, మీరు దగ్గరన నిలిచియుండి, తప్తతైలకటాహమునఁ బడ వేయింపుఁ—డని కఠోరముగ శాసించి తా నపుడపుడ ప్రయాణోన్ముఖుఁడై కొలువుఁ బాసి చనెను.

రాజునానఁ దప్పక యప్పటికప్పుడ ధర్మని యుద్ధ దుందుభి మొరయింపఁబడెను. అప్రోంత విసీవినమి సేన లెల్ల నిముసమునఁ దమతమ లాంఛనములతోఁ దమతమ యాయుధవిశేషములతో బారులు దీరిచి నిలువఁబడెను. శంఖములు, కొమ్ములు నూఁదఁబడుచుండ, జయజయధ్వను లాకస మంటుతూర్యరవముల నినుమడింపఁ జేయుచుండెను. ఆహవోత్సాహమునఁ గాలు మువ్వ నవ్వాహిను లతో నమ్మహీపురందరుఁడు పురి వెడలుకడఁక నుండెను.

౨

## సుధన్వుఁ డనికి రాక యాలసించుట

అత్తఱి సుధన్వుఁ డని కేగ నాయితమై కన్నతల్లి పాలికిం బోయి నమస్కరించి, తల్లీ! యుద్ధమునకుఁ బోయి వత్తు. ననుజ్ఞ యిమ్మనెను. అచ్చలనితల్లి కొడుకును గౌఁగి లించుకొని, బిడ్డా! విజయలక్ష్మితోఁగూడ వచ్చి నాకను పండువు సేయు, మని దీవించి పంపెను. అంత సుధన్వుఁడు తనచిన్న చెల్లెలిం జూడఁ బోయి, పోయి వత్తు నని చెప్పి తనయంతిపురమునకుఁ బోయి భార్యయగు ప్రభావతితో నట్లే యుద్ధమునకుఁ బోయి వత్తు నని చెప్పెను.

యుద్ధప్రయాణవార్త వినినంతన గుండె గుభిల్లుమనియు రాజరమణి యవ్వట దిటవుఁ బూని ప్రభావతి, నాథునకు

మంగళనీరాజన మర్పణసేసి. యెత్తునీళ్ళు దీసి పోసెను. రత్నా సనమునఁ గూర్చుండఁబెట్టి పతిపాదములు గడిగి, యా జలముఁ దనయూఁదలఁ దాల్చి యడుగులతడి యొత్తెను. సుధన్వుఁడు లేచి తొందరపడుచు బెట్టిదంపు తండ్రికట్టడ వినిపించి, పోయివత్తు పంపు మనెను. అంతఁ బ్రభావతి దీనయై నాథుని మరలఁ గూర్చుండఁబెట్టి యిట్లు విన్నవించు కొనెను.

వల్లభా! మీపలుకులు విన్నంత నదరిన యీ యెడమ కన్ను నా గుండెతల్లడమును మఱియు నినుమడింపఁజేయు చున్నది. ఎన్నఁడు నెఱుఁగని యీయమంగళచిహ్న మీనాఁ డెందులకుఁ దలసూపినదో తోఁపదు. వచ్చినవాఁ డింద్రుని గాదలికొమరుఁడు వానికిఁ దో డుపేంద్రుఁడు. యుద్ధపద్ధ నరసిన వెన్ను విఱుగునటు లున్నది. సార్థకనాములై తేజోనిధులైన మీకుఁ దక్కినయలుపులప్రతాపము లొక లెక్కలోనివి కావు. సూర్యుని తేజమునఁ దక్కిన వెలుఁగు లన్నియు నిమిడిపోవుట సిద్ధము. అయిన నీనాఁడు నా కొక లాగునఁ దోఁచుచున్నయది.

అంతియగాక, మనోహరా! ఒకింత తడవు నిలిచి చరణసేవకురాలికి మీసేవాభాగ్యము ననుగ్రహింపుఁడు. అపారమైన మన సైన్యసాగరము శత్రురాజులవాహినుల నొక్కుమ్మడి లోఁగొన సాగిపోయినదిగదా. దిగ్గజములఁ బోలు మీసోదరులకు దాఁటిపో నెదిరిబలగ మొక మోకాటి

బంటిగుంటయుఁ గాదు. మీ రొకింతతడవు తడసినను వచ్చిన ప్రమాదము లేదు.

సుధన్వుఁ డది విని ప్రభావతితల నిమురుచు నిట్టు లనియె,

కాంతా! నీయట్టిధర్మపత్ని, మగనికిఁ గూర్చిన యర్ధాంగి, పతి నిటులు వేఁడుకొనుటలో నాశ్చర్యము లేదు. కాని మహారాజునాజ్ఞ సుగ్రీవాజ్ఞయేగదా. ఎదిరి యెవ్వఁ డగుఁగాక, అది రామబాణమై ప్రవర్తింపవలసినదే యనుట నీకు విదితమ. ఆలసింతునేని సలసల కాఁగిన నూనెతొట్టెలో నాయొడలు తల కొబ్బరికాయవలెఁ జిటచిట పెటిలి పెంచికలై పోక మానదు. చేఁజేత నంతదనుక నెందులకుఁ దెచ్చుకోవలె? కలన నర్జును నిర్జించి యిపుడిపుడ మగడివత్తు. అపుడు నను వరించి వచ్చిన విజయలక్ష్మి తోత్తువోలె నీయూఁడిగములు సేయ, మనము ప్రణయరసతరంగముల నోలలాడవచ్చు. ప్రకృతమున నట్టిప్రేమామృతము చిప్పిలు చూపుల, మృదుమధురములైన పలుకుల, ననుఁ బోయి ర మ్మనుము.

అని యెంత బోధించినఁ నియ్యకొనక వివశయై ప్రభావతి సుధన్వుని బిగ్గఁ గౌఁగిలించి పోనీయదయ్యె. ఆతఁడును బ్రియురాలిచనవున నేమియు ననలేక, తండ్రియానకు వెనుక ముందు లవుచున్న వాఁ డయ్యె, నంతిపురమున నొక కొంత యాలసించె.

3

## సుధన్వునిఁ గాఁగిన నూనెలోఁ బడవైచుట

పురబహిర్ద్వారము నిర్గమించుచు హంసధ్వజుఁ డొక్కమాఱు సేనల నెల్లఁ గలయఁజూచెను. బిరుదుమగలరథముల మీఁది ధ్వజములు విజయమునకుఁ దొందరపడుచు నెగురుచు హంసధ్వజునకుఁ గానవచ్చెను. కాని సుధన్వుని కేతన మా యపారసేనాసాగరమున నెందును నాయొడయునికిఁ గానరాదయ్యె. అయ్యవసరమునన కొందఱు లెంకనాయకు లరుదెంచి, సుధన్వుఁడు రాకుండుటను విన్నవించుకొనిరి.

అది విని మండిపడుచు హంసధ్వజమేదినీమండలాఖండులుఁడు, "మీరు పరుగుపరుగునఁ బోయి నాయాన మీరకు దాఁటి చనిన యానీచుని శంఖలిఖితుల కప్పగించి కాఁచిన నూనెతొట్టియలోఁ బడఁద్రోయింపుఁ" డని లెంకనాయకులకు శాసించెను. తమయేలికనోటినుండి యాందారుణవచనాస్త్రము వెలువడీ వెలువడక మున్న వారును సుధన్వుని ప్రాసాదరాజమున కభిముఖముగఁ బోయిరి.

ఎట్టకేలకుఁ బ్రభావతిని వీడ్కొని సుధన్వుఁడు కయ్యమున కాయితమై తేరెక్కి తండ్రి యేమనునో యని కలఁతపాటునఁ దొందరపడుచు వాయువేగమున వచ్చుచుండెను.

సేనల కంతనంతల వచ్చుసుధన్వునిఁ గని లెంకనాయకు లెలుఁగెత్తి కేక వెట్టి తేరాఁపుదలచేయించి ప్రభువునానతి వాని కెఱిఁగించిరి.

అది విని సుధన్వుఁడు ధన్యోస్మి యనుచు నరదము డిగ్గి యిష్టదైవమగు శ్రీకృష్ణభగవానునకును, దండ్రికిని నమస్కారము లర్పించి వారలతో ని ట్లనియె.

అయ్యలారా! మీరు మా నమ్మినబంటులే యగుదురుగాక. తండ్రిఋణము నీఁగి పుట్టువునకు సార్థకత గడింప నిప్పట్టున నాకు సహాయులరై మహోపకార మొనరించితిరి. కావున మీ రెంతయుఁ బూజ్యులరు. ఇంక ధర్మశాస్త్రగురువులై, గురుతుల్యులైన శంఖలిఖితులో, నాపాలిదైవములు.

అంతియగాక, అక్కఱ పడినను, సెల వైనను, దండ్రియెడఁ గొమరుండును, ఏలికయెడ బంటును, అర్థవంచనము, ప్రాణివంచనము సేయరాదు. అటులు సేయఁ బాల్పడినయల్పుఁడు రౌరవాదినారకములఁ గూలుట నిక్కువ మని ధర్మశాస్త్రములు బోధించుచున్నయవి. మనయేలికయైన హంసధ్వజుఁడు నాకుఁ దండ్రియుఁ బతియును గాక దైవమును దానె యవుట నా కిప్పుడు నాజనకునియాజ్ఞ సేయుటయే జన్మఫలము. పదండు, ధర్మశాస్త్రగురువులపాలికిఁ బోదము.

లెంక లాతనిపలుకులు విని కఱిగి కనుగొలంకుల నీరు నింపుచుఁ దలంకియు నేలికకట్టడకు జంకి సుధన్వుం బట్టుకొన లేక పట్టుకొని త్రాళ్ళతో గట్టిగఁ గట్టి శంఖలిఖితులపాలికిఁ గొనిపోయి ప్రభునానతి విన్నవించిరి. అంత లిఖితుఁడు కింకరుల కుపదేశించుతలఁపున శంఖుఁడు విన సుధన్వునిగురించి యనె—

తనయాడి తప్పించనకుండ సమర్థించుకొన తేఁ డెవఁడు ప్రయత్నింపఁడు ? నిజమున నడువనిరాజునకు నిలువ నీడ యేపాలమున నుండదు. భయలోభములకు గుఱియై యెన్నఁడేని యాడి తప్పెనా, యప్పుడమిదొర రౌరవాది నరకజ్వాలలంబడి మిడుతవోలె మలమల మాడిపోవును.

నిష్కంటకమైన తనసామ్రాజ్యము నంతయు గాధి పుత్త్రున 'కిదం న మమ' యని ధారవోసి పురి వెడలి దేశ ద్రిమ్మరియై కాశిలో నర్ధాంగిని వంశకరుఁడైన కుమారునిఁ దెగనమ్ముకొని తా నొకకాటికాఁపరికి బానిసయై హరిశ్చంద్రుఁడు రోజు గడపె నన లోకమున సత్యమును బ్రతిష్ఠించుట కేగదా.

నారాయణునియవతారముగ వసిష్ఠాదులచే నను దినముఁ గీర్తింపఁబడు తనకన్నకొడుకును శ్రీరాము నడవుల కంపి దశరథుఁ డుసుఱు దొఱఁగినదియునాడి తప్పమికేకదా.

కావున సత్యమున కెడ గలిగి నడచునొడయునితో సాంగత్యము కోటి లాభము వచ్చినను దగదు. సుధీజనకోటి కాశ్రయభూతుఁడు గాక, సత్యదూరుఁడైన మానవనాథుఁ డొనరించు చేఁతఁజేతలకు కాతనిపురోహితుఁడు బాఁటయై తత్ఫలముఁ గుడువవలసియుండు.

అటు లవుట నిత్యసత్యవ్రతమ్మునఁ దలఁగక, ధర్మమూర్తియైన మనదేవియాన నీతని కొక్కనికె కాదు. సుహృత్పితృ మాతృ బాంధ వానుజ తనూజుల కెవ్వరికిని దాఁటి చన నలవి గాదు.

సుధన్వుఁ డా పలుకులు విని చిఱునవ్వు నవ్వుచుఁ బ్రసాద మని, మేని బొందళము విప్పి, విల్లుబాణము లావల నిడి, సామాన్య వేషమున విధేయుఁడై ధర్మగురువుల కట్టెదుర వినయమున నిలఁబడెను.

చేరువన భగభగ మండు మంటలపై సలసల కాఁగి పొంగులు వాఱుచున్న నూనెతొట్టెఁ జూపి శంఖలిఖితులు— సుధన్వా! ఆలస్యమునకు రాజు విధించిన శిక్ష యీకటాహమునఁ దడయక డిగఁబాఱుటయే—యని పలికిరి.

చుట్టు నున్నవారల హాహారవము లెంత యడఁచి కొన్న నడఁగక ముఖద్వారమునుండి వెలువడి వలఁకుల కెగఁబ్రాఁకి యంతఃపుర కాంతల శ్రవణకుహరముల మాఱు మ్రోగి వారల హృదయకవాటములు బ్రద్దలు సేయసాగెను. చంపకాపుర మంతయు శోకకంపముల కాఁపురమై తల్లక్రింద లగుచుండెను.

అంత సుధన్వుఁడు తులసిమాలలు, తామరపూసల సరులు, తులసిపూసలదండలు, మెడ నలంకరించుకొని, కేలు దామరవిరు లెత్తి జోడించి, పీతకౌశేయవాసుఁడు, వనమాలాలంకృతుఁడు, చతుర్బాహుఁడు, శంఖచక్రగదాధనుర్ధరుఁడు నగు పుండరీకాక్షుని నిండుమనమున నిలిపి ధ్యానించుచుఁ దప్తతైలకటాహమును ముమ్మాఱుచుట్టి వచ్చెను. అచ్చటివారెల్లరు నల్లడతల్లడ పడుచుండిరి. శంఖలిఖితులకుఁ గాలు నిలుచుటలేదు.

అట్టియెడ సుధన్వకుమారుఁడు భగభగ మండు తైల కటాహమును దనచేతులఁ దొడికిలిపట్టి, రాహువు చంద్రునిఁ గబళింప నుంకించుచున్న తెఱఁగు దోఁప, భద్రగజము మడుగుఁ జొచ్చినరీతి, బిట్టుడుకు నా నూనెతొట్టియలో నిట్టట్టు వడక డిగఁబాఱెను. హరిదాసులు సత్యసంపదల నెంతయు బలవంతులుగదా.

అఖిలములైన యగ్నిజ్వాలలతోఁ గాఁగిపోవు దారుణ తైలకటాహము కుత్తుకబంటి గాఁగా సుధన్వుఁ డెల్లరుఁ జూచుచుండ నిలువఁబడెను. అప్పుడాతని ముఖబింబము కాళిందీనదియుదకములోని కమలమో యనఁ జూడ నొప్పె.

మోహ మెడలి, దనుజదమనుఁ డగు శ్రీమన్నారాయణునిపై స్నేహము నుద్దీపింపఁజేసి యటు డిగఁబాఱిన సుధన్వకుమారున కా తప్తతామ్రకటాహస్నేహము, శరత్కాల మందలి నీహారకిరణునిసాంద్రచంద్రిక యై, చల్లఁదనమున సుఖస్పర్శమై సంతస మొడఁగూర్చుచుండె. సుధన్వుఁడును రాజీవాక్షునిపై మనసు నిడి యొం డెఱుఁగని భక్తిభావమునఁ జెక్కుచెదరక యందు నిలిచి యుండె.

అది గని శంఖలిఖితులు పరమాశ్చర్యమునఁ జకితులై సుధన్వుఁడిటు లుంట యొక యింద్రజాలవిద్యావైభవవిశేష మహిమాతిశయముగా నున్నది. నూనె సలసల కాఁగ లేదేమో! పరీక్షించి చూడవలయు, నని నారికేళఫల మొండు తెప్పించి యందుఁ బడవేయించిరి.

వెనువెంటన యాముక్కంటిపండు చిటచిటమని పెటిలి పెంచికలై వేయి ముక్కలుగ నెగిరి పదిదిక్కులం బడెను.

అంత శంఖలిఖితులు పరమాశ్చర్య భయ విషాద సంభ్రమ శోక ప్రకంపనమ్ములు ముప్పిరిగొనం దటపట పడుచు సుధన్వకుమారుం డితండు హరిభక్తిరతుండు. తప్పదు ప్రహ్లాదునింబోలె బరమభాగవతశ్రేష్ఠుం బరాభవించి యెగ్గులు తలపట్టిన యసముల దురితోపశాంతికిం దీప్తతామ్రకటాహమున బ్రోంతలు వెట్టుచుం బొంగి పొరలి పోవు వేడినూనెలో నిపుడిపుడ డిగి మునుంగుటయ కాక వేఱొండు తెరువు లేదని నిశ్చయించి హాహారవములతో నెల్లరుం జూచుచుండ నొక్కుమ్మడిగ నానూనెతొట్టిలో డిగంబాఱిరి.

అత్తఱిం బరాగమేఘమాలిక లమోఘములై యాముష్కరమీంద మందారమరందపుముద్వర జేఫ్యాన ఉవ్వంగొడంగె. వేలుపులు పువ్వులజడివాన గురియించిరి.

"సుధన్వా! మేలు మేలు. నీసత్యవ్రతమును జూచి దిక్పాలు రెల్లరు నాశ్చర్యచకితులై సంతసించిరి. హరిభక్తులకుం దలమానికమ వని తెలియక నిన్నుప్పగిది నొప్పించిన కించులకుం బ్రాయశ్చిత్త మనునది లేదు. కాని, నీదేహసంసర్గమున వారలును బునీతులై నీయంతవార లైరి. పరుసము సోంకిన నినుము సయితము మేలిమి కాదా." యని

యాకసమునుండి గంభీరమైన వాక్కొక్కటి యెల్లరకుఁ దెల్లముగ వినవచ్చె.

అనంతరము శంఖ లిఖిత సుధన్వులు ముగ్గురును, సరోవరమునఁబోలెఁ, దప్తతైలకటాహమున నవగాహనము సేసి వెలువడి వచ్చి, తొల్లింటికంటె మెఱయు దివ్యదేహముల సముచితాలంకారవిశేషముల నలంకరించుకొనిరి. శంఖలిఖితుల సంభ్రమాద్భుత హర్ష ప్రకర్షములకు మేర లేదు. చంపకాపురము చంపకమువోలె వికసితముఖమై సంతసపుఁబరిమళము వెదఁజల్లుచుండెను.

ఒక్క నిముస మేనియు నింక నక్కడ నిలువక శంఖలిఖితులు సుధన్వుఁ గొని యచటివా రెల్లరు వెంటనంటి రాఁ బరుగుపరుగున హంసధ్వజునిఁ జేరఁబోయి జరిగిన దంతయు మహాద్భుతముగ వర్ణించి విన్నవించిరి.

హంసధ్వజుఁడు మహానందమున నిజనందను నక్కునఁ జేర్చి కుమారా! నీవలన నావంశ మంతయు వన్నె కెక్కిన యది. తప్తతైలపాత్రమునఁ బడఁద్రోసిన నిన్ను భక్తరక్షాపరాయణుఁడైన నారాయణుఁ డుద్ధరించుటయ కాక యింక యుద్ధరంగమున దరిసెన మిచ్చి మమ్మెల్ల నుద్ధరింపనున్నాఁడు. నరునకు సాయముగ నేతేరిన యా నారాయణుని తోడి కయ్యమున కీవ తగిన యెదిరి. కావున నాకఠోర శాసనమును బాలించి హరికరుణాసామ్రాజ్యశ్రీ నవధరించిన

ని న్నిపుడ సేనాపతిపట్టమున నియమించెద. నిర్వహించి జయమును గూర్పు—మని యట్ల చేసెను.

సుధన్వుఁడును మహాప్రసాద మని తండ్రి యానతి సేనాపతియై యరద మెక్కి వాహినుల నడిపించుకొని నరనారాయణుల సెమర్కొనఁ బోయెను.

---

కల్యాణీ ప్రెస్, తెనాలి—25-10-45/-170 కాపీలు.

